# భగవాన్ శ్రీరామతీర్థ

రచన:

## శ్రీ కేశవతీర్థస్వామి

> "ఈ రామ పరమహంస, "ఏకమేవా ఽద్వితీయం బ్రహ్మ", "అహం బ్రహ్మాఽస్మి" అనే రెండు రెండు రెక్కలతో ఎగిరి ఎగిరి సత్య బ్రహ్మానంద నీలాకాశంలో కలసిపోయింది."
>
> — పూర్ణసింగ్, పంజాబు.


## శ్రీ రామతీర్థ సేవాశ్రమం

పిడుగురాళ్ల పోస్టు : : గుంటూరు జిల్లా

# కావాలె !

" కావాలె సంస్కర్త లవసరం ఇప్పుడు
పరులను సంస్కరింపను కాదు – ముందు
తమ్ము తామే సంస్కరించుకొనంగ.
విశ్వవిద్యాలయ మందున చదివి
డిగ్రీలుపొందిన వారలు కాదు –
ఘనజితాహంకార ధీరులుగాని.
వయసు :—విద్యానంద నవయౌవ్వనంబు,
జీతము :—అమరమహా బ్రహ్మాత్వమును.
త్వరలోన దరఖాస్తులను పంపుకోండి !
నీచయాచనలతో, నతులతో కాదు –
ఆధికారిక దృఢసంకల్పమునను.
ఎవరికో తెలుసునా – ఎవరికో కాదు,
నీ ఆత్మయగు జగత్పరిపాలకునకు. "

ఓం ! ఓం !! ఓం !!!

— శ్రీ రామ తీర్థ.

" నీ ఆత్మలో నీవు శ్రుతి గల్పవోయి,
మిత్రులు, బాంధవజన సమూహములు,
కాలము, ఎస్టేటు, కీర్తి ప్రతిష్ఠ
ఊహలు, గౌరవాల్, కళలలో నేర్పు
ఏదైన మరిగాని ఒకటైన విడక,
సర్వంబు ప్రేమకే అర్పింప వోయి."

— రామతీర్థ

ప్రేమ అంటే దివ్య ప్రేమ, విశ్వాత్మక ప్రేమ అని.
అంటే స్వాత్మైక్యతకొఱకు, బ్రహ్మైక్యతకొఱకు — రచయిత.

౬౦

# గురుదక్షిణ

[ శివరాత్రి : లింగోద్భవకాలం : శ్రీకాళహస్తీశ్వర సమర్పణం ]

శ్రీ గురుదేవ ! చంద్రధర
శేఖర ! శంకర వ్యోమకేశ ! నీ
వే గద నాడు నన్ను పృథు
భీషణమౌ భవపాశబంధమున్
వేగ విదల్చి త్రెంచి, యతి
వేష మొసంగిన సత్కృపాబ్ధి వీ
శా ! గురుదక్షిణం బొసగ
జాలితి నేటికి నీ కృతిన్ మహా
భాగ ! గ్రహింపవే, పరమ
భద్ర మొసంగవె పార్వతీపతీ !

2

నీయతి దివ్యమంగళ వి
నిర్మల నామజపంబుచేత, తం
డ్రీ ! యమరాధిపత్యమున
కేని యసహ్యము జెందగల్గు సు
శ్రీ యమరున్, అదే యొసగి
శిష్యుని గాచితి వీరుణంబు నే

నీయగజాల, నీ కృతి ని
రేగాని, నన్ను గృతార్థు జేయవే !

3

నీచపు పాములన్ మెడను,
నెత్తిపయిన్ గురుదోషి చంద్రు, సం
కోచము లేక తాల్చి, దయ
కున్గురి చేసితి వెంత సత్కృపో !
ఆ చనువే మదాత్మ కొక
ఆశ, మహేశ ! సురేశ ! ఈశ ! నే
పూచిన తుమ్మి పూవొకటి
పూజకు తెచ్చితి రా గ్రహింపరా !

4

ఈ శివరాత్రివేళ, పర
మేశ ! మదీయ మునాశ్రుధార, దే
వా ! శివ ! నీ పదాబ్జముల
యం దభిషేకము జేసి, తండ్రి ! వి
శ్వేశ ! మదాత్మ బిల్వమున
బ్రీతిని పూజయొనర్చి యిచ్చు నా
యీ శుభ సత్కృతిన్ గొను మి
దే జగదర్చిత దివ్యవైభవా !

5

ఈ లలితేశ కార్యమున
కెంతయు శ్రద్ధవడె చంద్రమౌళి, ప
న్నాల కులాబ్ధిచంద్రుడు, వి
నమ్రగుణుండు పరోపకారి సీ
తా లలనేశభక్తుడు, ని
తాంత కృపన్గను మాతనిన్ శివా !
శ్రీలను, త్వత్పదాబ్జరత
చిత్త మొసంగి పరాత్పరా హరా !

6

ఈ కృతి దక్షిణన్గొనుము
ఈ పదదాసు ననుగ్రహింపుమా
ఈ కలిచేత జిక్కని య
హీన విరాగము భక్తినిచ్చి స్వా
మీ ! కరుణాసముద్ర జగ
దీశ్వర ! భక్తసురద్రుమా ! హరా !
ప్రాకట కాళహస్తి నగ
వసిత ! మత్పిత ! పార్వతీయుతా !

ఓం ! ఓం ! ఓం !

ఓం

# భూమిక

యుగాలనాటి మాటకాదు. దాదాపు అర్ధశతాబ్దం లోపులనే భారతగర్భంనుండి ఒక ప్రజ్ఞాన ఘనజ్యోతి బయటకు వచ్చి అనంత విశ్వాకాశంలో అబ్బురంగా వెలిగివెలిగి అంతర్థానమైపోయింది. హిమగిరి శిఖరాలలో, సురతరంగిణీ పులిన తలాల్లో ఆధ్యాత్మిక మధుర సంగీతాన్ని ఆలాపన చేసిచేసి ఒక మహాపరమహంస గంగాగర్భంలో కన్నుమూసింది. జ్ఞానానికి ప్రతిబింబంగా, సత్యానికి ప్రతిరూపంగా, త్యాగానికి ప్రతికృతిగా, ఉపనిషద్ ఋషుల మతసిద్ధాంతానికి మచ్చుతునకగా అట్టిట్టనరాని అవాఙ్మనసగతత్త్వమొకటి జీవంపోసికొని కాళ్ళు చేతులు కరిపించుకొని మానవలోకంపైకి వచ్చి విహరించి పోయింది.

ఎవరాయన? ఎందుకంత ఆదుర్దా? వినండి.

జీవితమొక ముళ్ళపొదై పోతూ ఉంటే తన స్నిగ్ధ గంభీర కలాకౌశలంతో గులాబితోటగా మార్చేసి దిగ్దిగంతాలను సురభిపరిమిళితంగా చేసిన నవసృష్టి నిర్మాత—

అడుగడుగునా అమాంతం మింగేదానికి సింహికా పిశాచాల్లాగ నోళ్లుదెరచి నాల్కలుసాచిఉండే ఘనఘోర భయంకర కష్టపరంపరలను చించి ఛేదించి రామబాణంకైవడి తన లక్ష్యంపై వ్రాలిపడిన ధీరహనుమానుడు —

జీవన సంగ్రామంలో నిరాయుధుడైకూడా వీరవిజయాన్ని సాధించి పుట్టినదాది నిముష నిముషాన్ని గడియగడియను తపస్స్వాధ్యాయాలలో అదిమిమెదిపి తన్ను తాను నిర్మించుకొన్న సిద్ధమూర్తి -

కుడియెడమల చూడకుండా చేదోడు వాదోడు లాసించకుండా తన గమ్యాన్ని చూసి హుటాహుటి ఏకధాటిగా పయనం సాగించిన విచిత్రపథికుడు

“ధరసింహాసనమై నభంబుగొడుగై తద్దేవతల్ భృత్యులై- పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండమాకారమై” పరిఢవించిన శ్రీరామపాదుషా-శ్రీరామతీర్థ గురుదేవుడు.

ఆర్య ఋషులు చాటిన పరమ సత్యాన్ని అనుభూతి ద్వారంలో విచ్చుకత్తిలాగ నిలబెట్టి లోకానికి యేర్పర్చి చూపించిన శ్రీరామతీర్థ స్వామివారి జీవితగాథను పరిమిత రూపంలో చిత్రించి శ్రీ కేశవతీర్థస్వామివారు ఆంధ్ర పాఠక లోకానికి అర్పిస్తూఉన్నారు. కదలిపారాడే భాషలో తటపటాయించని ఉద్భటశయ్యలో శ్రీరామతీర్థులవారి సమగ్ర వేదాంత సారస్వతాన్ని ఆంధ్రజాతికి భిక్షపెట్టిన మహనీయులు శ్రీకేశవతీర్థస్వామివారు. అభ్యుదయ సాహిత్యకుల్లో ముందంజవేసిన శ్రీకేశవతీర్థస్వామివారు తన సర్వస్వంగా వుండే శ్రీరామదేవుని చరిత్రయందలి సువర్ణఘట్టాలను సేకరించి సామాన్యపాఠకలోకాని కుపకరించేనిమిత్తం యీసంక్షిప్తజీవని వ్రాశారు. వీరిదివరకే రామకథ అనే పేర ఒక బృహజ్జీవితాన్ని

కూడా వ్రాసేవున్నారు. ఈరచయిత జగమెరిగిన బ్రాహ్మణులు. మనమోహన రూపంలో మధుమధుర శీలంలో మై అంచుల్లో తొంగి తొణకిసలాడే బ్రహ్మతేజస్సులో శ్రీ కేవతీర్థస్వామివారు సనాతన వైదిక ఋషిత్వానికి నవ్యనవీన నాగరిక సంస్కరణం (Edition) గా నాకు లో చేవారు. రామతీర్థుని కథ - కేశవ తీర్థుని రచన, వహావ్వా! ఈ అపూర్వ సంధానానికి ఆది నిధానంగా వుండే పరమాత్మునికి పదే పదే ధన్యవాదాలు.

మహాత్ములు జంగమ గంగానదులు, చైతన్య సాల గ్రామాలు. వారి జీవితాలకు ప్రతిసారస్వతంలోనూ విశిష్టస్థానం వుంది. శ్రీరామతీర్థస్వామివారి జీవిత చరిత్రలు నేనెఱిగినంతకు అన్ని భాషల్లోకూడా వివిధరూపాలలో పొడగడుతూవున్నాయి. శ్రీరామతీర్థ సేవాశ్రమం వారి యీ మహోద్యమ సేవా కృషిలో ఆంధ్రలోకం తీరని ఋణానికి పాల్పడిపోయింది. విప్పు కొన్న హృదయాలలో చివరకు కృతజ్ఞతా వందనాలనైనా అర్పించి తన కనీసపు ధర్మాన్ని పాలించేదానికి వెనుదీయదని నా అంతరాత్మ విశ్వసిస్తూంది.

సాంసారిక తాపత్రయాలలో సతమతమైపోతూవుండే ఓ పామరనరులారా! శ్రీరామ చరితా గంగాస్రవంతిలో మునకలెత్తి ప్రశాంతులుకండి. ఓ నాఋషి సంతానములారా! విశ్వాత్మయై విరాజిల్లిన ఆ తాపసకులభూషణుని స్వరంలో శృతిమేళవించి అహంబ్రహ్మాస్మిగానం చేయండి. ఓ భారత పౌరులారా! జీర్ణ శీర్ణమై జరాభారంలో మూల్గుతూవున్న మతా

నికి కాయకల్పంచేసి నరాలకు పటుత్వం కండరాలకు బిగువు చేదిపోసే శ్రీరామతీర్థ గురుదేవుని ఆదర్శాలను - ఉపదేశాలను స్వాగతపూర్వంగా గుండెలలో కౌగలించుకొని స్వతంత్ర భారతంలో, ప్రబుద్ధ భారతంలో, ఉద్బుద్ధ భారతంలో సత్య యుగానికి పునాదులు వేయండి. శాంతిధామానికి తాపలుగట్టండి. ఊటలూరి ఉప్పొంగిపోయే శ్రీరామకథామృత రసాన్ని కుత్తుకబంటి త్రాగి తన్మయసమాధిలో తద్రూపులమైపోదాము- రామభక్తులారా! రండి-పదండి.

గండిక్షేత్రం
కడపజిల్లా

ఓం తత్సత్
శ్రీ రా మ కృ ష్ణ

ఓం

# పరిచయ వాక్యాలు

ఏ ఆదర్శంతో శ్రీమద్ వివేకానందస్వాములవారు ప్రాశ్చాత్యదేశాల్లో వేదాంతాన్ని బోధించారో, ఆ ఆదర్శాన్నే తదనంతరం కొంతమంది అనుసరించారు. స్వామీజీ స్థాపించిన 'రామకృష్ణమిషన్' సన్యాసులు నేటికూడా అమెరికా మొదలైన పాశ్చాత్యదేశాల్లో వేదాంతాన్ని ప్రచారంచేస్తున్నారు. వీరుకాక, స్వామీజీ శివైక్యం చెందిన వెంటనే అమెరికాకు బ్రహ్మబాంధవ ఉపాధ్యాయులు, బాబాప్రేమానంద భారతి, శ్రీరామతీర్థస్వామి అనే మహాపురుషులు అమెరికా వెళ్లి హిందూమతాన్ని బోధించారు. మరికొందరు కూడా ఈ రీతిగా వెళ్లారు. కాని ఈ వెళ్లిన వారందర్లోనూ రామతీర్థస్వామి అగ్రగణ్యుడు.

భారతదేశంలో రామతీర్థస్వామిపేరు తెలియని మతాభిమానిలేడు. వేదాంతం శుష్కం అని భావించేవాళ్లు ఒక్కసారి ఆయన ఉపన్యాసాల్ని తెరిచిచూస్తే, అది హృదయంలో ఎంత పొంగు పుట్టించగలిగినదీ తెలుస్తుంది. శాస్త్రగ్రంథాలు ఇంత ఆనందదాయకంగా ఉండవు. ఏమంటే అవి పండితులు వ్రాసినవి. రామతీర్థులవారి ప్రవచనాల్లో, అనుభూతిని అక్షరాల్లో

మార్చి, ప్రాణంపోసి పలికినవి. అనుభవం లేని మతం సతమతమే!

ఈ మహాపురుషుడి జీవితాన్ని అనుధ్యానం చెయ్యటం పవిత్రకృత్యం జపతపాల్లాంటిది.

ఆదర్శపురుషుల జీవితంలో తత్కాలపు ఒడుదుడుకులన్నీ స్పష్టంగా కనిపిస్తాయి. అంతమాత్రంతో కంగారుపడి నిలచిపోతే వారు ఆదర్శపురుషులే అయ్యేవారు కాదు. ఆయా కష్టాల్ని నిర్జించి, ఏరీతిగా వాళ్లు మహాపురుషపట్టాన్ని విశ్వాసులద్వారా పొందారనే విషయమే గమనీయం, పరమరమణీయం. ఆ యీ పరిస్థితుల్లోంచి సానపెట్టిన వజ్రాల్లాగా దీప్తితో వారు బయట పడడమే మనకు అనుసరణీయం.

దారిద్ర్యం, తండ్రి అడ్డంకి, ఉద్యోగప్రలోభవ్యామోహం అనే పర్వతాల్ని పిండికొట్టి, రామహృదయం లోంచి వేదాంత స్రవంతి బయల్దేరి, జగత్తు అనే మహాసాగరంలో కలిసిపోయింది. ఆయన హృదయం లోంచి లేచిన కరుణాతరంగాలు ఎంతమందినో ఉద్ధరించాయి. దుఃఖాన్ని ఆనందంగా మార్చాయి. ఈ ఉద్ధారకశక్తి కేవలం సాధు మహాపురుషుల్లోనే ఉంటుంది.

శ్రీరామతీర్థస్వామి సంస్థను స్థాపించటంలో తన శక్తిని అపవ్యయం చెయ్యలేదు. ఎదుట పడి అడిగిన వాళ్లందరకూ

బ్రహ్మజ్ఞానానందకణాల్ని పంచిపెట్టి 'తృప్తోఽస్మి' అనుకున్నాడు.

సాధువులన్నా మతమన్నా అంతగా అభిరుచి లేని దేశం తెలుగుదేశం. భారతదేశమంతా తిరిగి తమ దయను పంచిపెట్టిన, వివేకానంద రామతీర్థాదు లెవ్వరున్నూ, ఈ గడ్డ మీద కాలుపెట్టలేదు. మతప్రచారం చెయ్యలేదు — అనే విషయాలు విస్మయాన్నే కాకుండా, దుఃఖాన్నికూడా కలిగిస్తాయి!!!

అయితేనేం! అఖండజ్యోతిలాగా వారు ఇతరత్ర చేసిన ఉపదేశాలున్నూ, వారి జీవన చర్యలున్నూ అక్షర రూపంలో ప్రకాశిస్తున్నాయి. ఎంతమందో వాటిని అధ్యయనం చేసి పరమశాంతిని పొందుతున్నారు. సుస్పష్ట - ఆదర్శమే లేని తెలుగుజాతి, వీటి నిజాయితీని కూడా పరికింపలేనంత అంధంగా ఉండింది నేటివరకు.

ఈ అంధకారాన్ని తొలగించటానికే, శ్రీ కేశవతీర్థ స్వామివారు పరిశ్రమిస్తున్నారు. ఇందుకు పూర్వమేవారు 'రామతీర్థోపన్యాసాల్ని' ఎంతో పరిశ్రమతో తెలుగులోకి తీసుకువచ్చారు. ఇప్పుడీ గ్రంథంలో శ్రీరామతీర్థులువారి దివ్యజీవితాన్ని ఎంతో కళాకౌశలంతో చిత్రించారు. ఈచిత్రణ ఆంధ్రుల హృదయ ఫలకానికి అతుక్కుంటుందా?—అనే నా ప్రశ్న.

తల్లిదండ్రులూ, ఉపాధ్యాయులూ, గ్రంథ భాండాగారాధ్యక్షులూ తమ చెప్పు చేతల క్రింద ఉన్న వాళ్ళ చేతుల్లో ఈ గ్రంథాన్నుంచి "రామతీర్థుడివలె దేశాన్ని ప్రేమించు, ఉన్నత భావాల్తో సరళ జీవితాన్ని అనుసరించు, దైవభక్తితో నీ హృదయాన్ని ప్రతిస్పందింపచేసికో, బ్రహ్మజ్ఞానంతో మేధస్సును ఉజ్జ్వలంచేసికో, దుఃఖ కష్టాల్లో ఉన్న వారిని ఉద్ధరించు" అని ఆశీర్వదిస్తారుగాక! అని నేను కోరుకొంటున్నాను.

ఆ యీ జీవితాదర్శాలు ఆచరణలో లేకపోతే దేశానికి అధోగతే. తస్మాత్ జాగ్రత!

శ్రీరామకృష్ణ మఠం,<br>భువనేశ్వర్, ఒరిస్సా.<br>31-3-50

ఇట్లు<br>శ్రీ నిర్వికల్పానంద స్వామి

# నాంది

ఇది శ్రీరామతీర్థ భగవానుని సంక్షిప్త జీవన చరిత్ర. ఇదివరలో శ్రీరామకథ అనే పేరుతో స్వామి బృహజ్జీవితమును ప్రకటించాము. జనసామాన్యానికి అందుబాటులో ఉండాలని ఈ రచనచేశాను. స్వామిజీవితం అన్ని చరిత్రల వంటిది కాదు. అదేదో ఒక దేవగీతం. ఏదో ఒక వెన్నెలలోకం. మనస్సు అంత వియత్పథాలకు ఎగరాలె. రెండుమూడు దినాలు రచనకు మహావస్థపడ్డాను. కలం సాగలేదు. అహం నశించింది. రామభగవానుడే సారథ్యం వహించాడు. మూడు నాలుగు దినాలలో అవలీలగా రచనం పూర్తిఅయింది. నలుగురు ముగ్గురు ఉత్తమ మిత్రులకు వినిపించాను. నేను పొందిన అనుభూతినే వాండ్లూపొందారు. స్వామి అపారానుగ్రహమిది! కాకపోతే ఎంతమంది సమర్థులులేరు! ఎంతమంది పండితప్రకాండులులేరు! కానీ కోతులవంటి మాకే రామసేవలభించింది!

ఈ రచనకు మొదట సముత్సాహపరిచి, ప్రేరణజేసిన ప్రియమిత్రుడు రాచమడుగు ఆంజనేయులను మఱచిపోలేను. వ్రాసినపిదప ముద్రణావిషయంలో ఆలోచించే సమయంలో ముందుకువచ్చి, ధనమును పెట్టుబడిపెట్టిన మా పన్నాల చంద్రమౌళిని భగవానుడు అనుగ్రహించుగాక! కానీ చూస్తే తమ

ప్రాణాధికంగాచూచుకొనే ఇట్టి విభ్రాంతమైన నాగరికలోకంలో, ఈ పవిత్ర సేవాజ్ఞానికి చేయూత ఇచ్చిన చంద్రమౌళి హృదయసంపద వర్ధిల్లుగాక !

హృత్పూర్వకమైన భూమికలు వ్రాసియిచ్చిన శ్రీ రామ కృష్ణయ్యగారికి, శ్రీ నిర్వికల్పానంద స్వాములవారికి నిరత కృతజ్ఞులము.

విషయవాసనా పంకిలమైన జగద్రంగాన్ని అధిగమించి, పరమ శివసుందరమైన శాంత హిమశిఖరాలకు ఎగిరిన రామ పరమహంస జీవిత జ్యోతియొక్క వెలుగులలో మన జీవిత గమనాన్ని సంస్కరించుకుంటాముగాక ! మన శాశ్వతమైన పరమానందమును పొందుతాముగాక ! స్వామివలె మనం గూడా వీరులమై అహందుర్గాన్ని బదాబద్దలుచేసి, స్వసింహాసనాన్ని ఆక్రమించి, ఇంద్రియరాజ్యంపైన మన పాలన చెలామణీ చేస్తాముగాక ! ఇక గ్రంథం చదవండి !

శ్రీ రామతీర్థ సేవాశ్రమం
ఫాల్గుణ శుద్ధపౌర్ణమి, 1950

ఓం తత్సత్
కేశవతీర్థస్వామి

ఓం

# మ హో ద యం

**భా**రత వర్షం సర్వజగత్తుకు ఒక గురుకులాశ్రమం. భారతవర్షం జ్ఞానపీఠం. భారతవర్షం తపోవనం. భారతవర్షం సర్వ మానవ తాపోపశమనకారకమైన ఆధ్యాత్మిక సరోవరం! భారతవర్ష మనే పేరు ఎందుకు వచ్చిందీభూమికి? భరతుడనే రాజు పాలించాడు గనుక-అని కొందరి వ్యవహారం. భగవంతునియందు, పరబ్రహ్మమునందు రతిగల దేశంగాన భరతవర్ష మనే అన్వర్థనామం వచ్చిందని సత్య ప్రతీతి. అట్టిదీ భరతఖండం! చరిత్రలు తొంగిచూడలేని అంధకార యుగాలక్రితమే కోటి ప్రపంచానికి వెలుగుచూపిందీ ఋషిదేశం. యావత్ప్రపంచం మోక్షరిల్లదగిన ధర్మసందేశాలను ప్రసాదించిన, పంచిపెట్టిన ధర్మ రత్నఖని ఈ ఆర్య భూమి! ఉక్కిరిబిక్కిరిగా అలముకొనిన చీకటి తుపానులలో సైతం, తన విశిష్టతను కోల్పోని ధర్మమేరు వీ హిందూభూమి! తన ధర్మసందేశ విశాల బాహువులలో, సర్వమానవులను, సర్వ జాతులను, సర్వ మతాలను, సర్వ మార్గాలను ఆలింగనం చేసుకొని పునీతం చేసిన దీపుణ్య భూమి! అందుకనే దేవతలు సైతం, పతితులైనప్పుడు, తమ హృదయ సంస్కరణానికి జ్ఞానార్జనానికి, మానవులై పుట్టి భారత మహర్షుల పాదసన్నిధిలో విద్యార్థులైనట్లు పౌరాణిక వాఙ్మయ ప్రపంచంలో ఉద్ఘోషితమైనది.

ఎన్ని ఆఘాతాలు వచ్చినా భరతవర్షం తన ఆదర్శాన్ని కోలుపోదు. కాలపురుష కోపానలంలో బూది అయినా, ఆ బూదిలోనుంచే ఒక ప్రచండ జ్వాల రాజిరాజి లేవవలసినదే! మానవలోకానికి ప్రతి అవసర సమయంలోనూ, భారత వర్ష ధర్మ కంఠము అభయవాక్కులు ఘోషించవలసిందే. సనాతనమైన, అమరమైన, హిందూదేశ మత సరస్సులోనే, భయంకరమైన అజ్ఞానమనే ఎండచేత బాధపడుతున్న మానవులు దాహం తీర్చుకోవలసి యున్నది.

జగజ్జీవితంలోని ఒకమహా విషాదఘట్టం వచ్చింది. భౌతిక వ్యామోహం పెల్లుపెరిగి మానవుల సమరస గమన పథానికి ఒక మహావింధ్యంగా నిలుచున్నది. సనాతన సత్య సూర్యునికి విముఖమై మానవలోకం మిథ్యావస్తుచ్ఛాయల వెంట వేటాడ సాగింది. స్వనిర్మితమైన అహంకారపు కారాగారంలో చిక్కుకొని జగతిమూలగ సాగింది – భగవంతునికీ, మానవునికీఉన్న బాంధవ్యబంధాలు తెగిపోయి, నైరాశ్య తమస్సులు క్రమ్ముకొన్నాయి. వెల్లుబుకిన ఒక మహాఅజ్ఞాన సముద్రం జగతిని ప్రయ్యలుచేసి, అడుగడుగూ ఒక అఘాతంగా మార్చింది. భేదత్వం, నాస్తికత, దుర్బలత, నైరాశ్యత, హింస, తృష్ణ, రక్తపిపాస, జడత, పరస్పర వైషమ్యత, అనే అజ్ఞాన రాక్షసుని దూతలు జగతిపై చైత్రయాత్రాభేరి మ్రోగించారు. మహాపాయవికలితమైన ఇట్టి సమయంలో, ఒక మహాపురుషుని మహోదయమైంది! ఇట్టి తరుణంలో, బాధాఘూర్ణితమైన మానవ లోకాన్ని, సముద్ధరింపను భారత రంగంపైన, తీర్థరాజమైన

భారతభూమిపైన, దేవభూమియైన భారతక్షేత్రంపైన; పుణ్యభూమియైన భారత స్థలిపైన శ్రీ రామతీర్థ భగవానుడు ఉదయించాడు! బద్ధమైన మానవజగతిని, తిరిగి విముక్తంచేసి, స్వారాజ్యసింహాసనంపైన సుప్రతిష్ఠ చేయడానికి, సత్య హిందూమత ఆధ్యాత్మిక శ్రీని ప్రపంచంలో మూలమూలలకు తీసుకవెళ్ళడానికి శ్రీ రామతీర్థుడు భారతరంగంపై అవతరించాడు! పరస్పర విభిన్నమైన మతాలకు సామరస్యకూటమైన మహోజ్వలమైన వేదోక్త అద్వైత జ్యోతిని చూపించాడు! ఈ పవిత్ర భారతవర్షంలో 1200 వందల సంవత్సరాలక్రితం ఆదిశంకరులు స్థాపించిన భగవత్సామ్రాజ్యాన్ని, శ్రీ రామతీర్థపునః గోచరింప జేశాడు!

ఓహో! శ్రీ రామతీర్థ మహోదయం! జగతికి శాంతి సూర్యోదయం!

ఓం! ఓం! ఓం!

ఓం

# జననము - బాల్యము

పరమ సత్యమనే అవనికిపైన ఎన్నో రూపాలు పుట్టి గిట్టుతున్నాయి. కొన్ని రూపాలు, కొన్ని బొమ్మలు, అవనికను పూర్ణంగా కప్పివేసి, వెనక ఉన్న అవనికనే విస్మరించేటంత వికారంగా చరిస్తాయి. కాని కొన్ని అసాధారణ చిత్రాలు, వెనకఉన్న అవనికను ఉద్దీపింపచేస్తాయి. చిత్రాలన్నీ చంచల మనిన్నీ, వెనకగల అవనికే నిత్యమైనదనిన్నీ నిరూపించేలాగు ప్రకాశితం చేస్తాయి. ఇట్టి మూర్తులనే మనం ఋషులనీ, మహాత్ములనీ, అవతారాలనీ, ప్రవక్తలనీ, పిలుస్తాము. ఇదే నిజం, ఇదే మా పరమ గమ్యమని ఈ దృశ్యమానమైన భౌతిక సంపదచేత మానవలోకం విభ్రాంతమైన జగచ్చరిత్రలోని ఒకానొక సమయంలో, అవతరించిన ఒక అసాధరణమూర్తియొక్క జీవిత కథనమిది !

శ్రీరామతీర్థస్వామి గోస్వామీ బ్రాహ్మణ వంశంలో జనియించాడు. ఈ వంశ మూలపురుషుడు శ్రీరామచంద్ర భగవానుని ఆచార్యమణియైన, తన అప్రతిమాన జ్ఞాన తేజంతో పురా చరిత్రలను మిరుమిట్లు గొలిపిన శ్రీవసిష్ఠ మహర్షి. ఈ వంశంలోనే మహాభాగవతోత్తముడై, తన మధురాతి మధుర రామాయణ గానంతో నిద్రాజగతిని జాగృతం చేసిన భక్తతులసీదాసు ఆవిర్భవించాడు. ఇట్టి దీ పవిత్రవంశం.

పంజాబు దేశంలో గుజరన్‌వాలా మండలంలో మురలీవాలా అనే ఒక గ్రామం ఉన్నది. అక్కడ నివసించే ఒక నిరుపేద బ్రాహ్మణుడు హీరానందుడు. నిరుపేద అయినా గోస్వామీ వంశజులవాని అనే సంపదతోటే హీరానందుడు జీవయాత్ర సాగిస్తున్నాడు పురోహిత వృత్తిచే వచ్చే తృణమో పణమో జీవయాత్రకు ఆధారం. ఈ హీరానందుని కుమారుడే తిరిగి గోస్వామీ వంశమునేకాక, సర్వజగత్తును ప్రకాశింప చేయ గలడు. మాటలుగా చెప్పుకోబడుతున్న లోకోత్తరమైన శ్రీ వశిష్ఠ జ్ఞాన ప్రతిభ, గ్రంథరూపంలో మాత్రమే చూడబడుతున్న మహోన్నతమైన తులసీదాసుని అపూర్వభక్తి యీ సామాన్య మానవుడైన హీరానందుని కుమారుని రూపంలో పునః ప్రదర్శితం కాబోతున్నాయి! అతి సామాన్యుడైన ఈ హీరానందుని జన్మాంతర సంస్కారం ఎంత దివ్యమైందో కదా!

1873 వ సంవత్సరంలో అక్టోబరు 22 వ తేదీన బుధవారంనాడు, హీరానందుని సతీమణికి ఒక ముద్దులశిశువు జనించాడు. బాలుని పేరు తీర్థారామ గోస్వామి అని. తీర్థారాముని తాత, గొప్ప జ్యోతిశ్శాస్త్రపండితుడు. పుట్టిన బాలుని జాతకం చూడగానే, ఆ వృద్ధపండితుడు ముందు విచారపడి, తిరిగి వెంటనే నవ్వుకున్నాడట. ఆతడు తన విచారకారణం ఇలా విశదీకరించాడు :- పిల్లవాడైనా మరణిస్తాడు. లేదా తల్లైనా చనిపోతుంది. నవ్వినకారణం, పిల్లవాడే గనుక జీవించినట్లైతే, మహాపండితుడై, జగదాచార్యుడై, తన యశః కాంతులచేత

యావత్ప్రపంచాన్ని ప్రదీప్తం చేస్తాడని అతడు విశదీకరించాడు.
రాముని జాతకచక్రమిది ;—

"విక్రమ స॥1930; శాలివాహనశకం 1795 దక్షిణాయన శరదృతువులో కార్తీకమాసము, శుక్లపక్ష ప్రతిపత్తు పాడ్యమీ బుధవారం 25 ఘడియల 55 విఘడియలకు, స్వాతీనక్షత్రం 31 ఘడియల, 25 విఘడియలకు ప్రీతియోగంలో 29 ఘడియల 49 విఘడియలకు, కర్ణ యోగమందు సూర్యోదయానంతరం 24 ఘడియల 48 విఘడియలకు కృత్తికదినము 8 మీనలగ్నమందు, రామముల్ కుమారుడైన హీరానందునకు తీర్థారామ బాలుడు జనించాడు. స్వాతీనక్షత్రము యొక్క అంత్యపాదంలో పుట్టడంచేత, ఈ బాలుని జన్మనామం తారాచంద్రుడని పెట్టారు.

| | | | |
|---|---|---|---|
| ల | రా | | |
| | | | |
| శ | | | |
| కు | | గ చం బు కే | గు శు |

ఇతర జ్యోతిష్కులుకూడా ఈబాలునికి ఉన్నతమైన భవిష్యత్తు ఉందని నిర్ణయించారు. తీర్థారాముడు, ప్రపంచ భోగవిరాగియై నిత్యసత్యానందాన్ని అనుభవిస్తాడు. లోక మోహ పంజరాలను విభేదించి, అగాధమైన మహాభక్తి సాగ

రంలో విలీనుడౌతాడు. పరదేశాలు సైతం సంచారంచేసి, మాతృదేశ ప్రతిభను పునఃప్రదీప్తం చేస్తాడు. ఇతడు తల్లిపాలు త్రాగడు. ఈతని జ్ఞానం అపారం, అగాధమై భాసిల్లగలదు. ఇతడు సన్యాసి కాగలడు. ఉన్నతమైన ఉద్యోగపదవిని తృణప్రాయంగా వర్జించి, దైవదర్శనార్థమై ఈ జాతకుడు అరణ్యసీమలకు నిర్గమిస్తాడు. 30 లేక 40 ఏండ్ల మధ్య వయస్సులో ఈతని జీవితం నీటిలో అంతమవుతుంది— ఈవిధంగా ప్రముఖ దైవజ్ఞులు నిరూపించారు.

ఇక్కడ ఒకసంశయం మనకు రావచ్చు. ఏమని? నక్షత్రాలు, గ్రహాలు, ఉచ్ఛస్థితిలో ఉండడంచేత, ఆయన జాతకం ఇలా ఉండడంచేత, ఆయన అంత ఉచ్ఛస్థితికి పోయినాడు. జాతకంలో ఉంటేనే కదా బాగుపడేది. మన సాధనాకృషుల వల్ల లాభమేమిటి ? ఆయన చరిత్ర ఆయనదే! మనకింక, ఈ జీవిత పఠనంవల్ల వచ్చేలాభమేమిటి ? ఎవరి నక్షత్రాలు ఎలా ఉన్నాయో, వారి జీవితగమనం అలాగే ఉంటుందిగాని, మధ్యలో మార్పేముంటుంది ? అని ఈవిధంగా యీఘట్టంలో ఒక వింతభావం, ఒక నైరాశ్యత మనకు బయలుదేరవచ్చు— కానీ జాగ్రత్తగా ఆలోచించండి. ఒకదృక్కోణంలో జీవితం, ఈ గ్రహాల గమనంపై ఆధారపడినట్లే జ్యోతిశ్శాస్త్రానుసారం కనపడుతుంది. వేదాంతముయొక్క సత్యదృక్పథంలో దీనిని ఈ విధంగా సమన్వయించగలం :—

నీ విధికి నీవేకర్తవు. దైవశక్తిని దుర్వినియోగం చేసుకోవడమే కీడు. ఆ దివ్యశక్తిని సద్వినియోగం చేసుకోవడమే

మంచి. ఒక మనిషి ఉన్నాడనుకోండి. ఆతడొక బండి చేసు కున్నాడు. ఆ బండిపైన ఎక్కి ఒక ఉద్యానవనం చేరవచ్చు. లేదా స్మశానం చేరవచ్చు. చేరుస్తున్నది బండిలాగే కనపడు తున్నది. కానీ ఆబండి నడుస్తున్నా, అది నడుపుతున్నది పైన మనిషే కదా. అదేమాదిరి మానవజీవిత శుభాశుభ కారణా లుగా నక్షత్రాలు అని జ్యోతిశ్శాస్త్రం చెప్పినా, ఆనక్షత్రాల, వివిధగమనాలకు నీవే మూలకారణమని వేదాంత దర్శనం.

అందుచేత, మన జీవితగమనస్వరూపాన్ని నిర్ణయించే లాగు నక్షత్రగమనాలను నిర్ణయించింది మొదట మననే. మననే తిరిగి, ఆ ఏకైకశక్తినే ప్రయోగించి, మనం జరిగే జీవితాన్ని మార్చుకోవడానికి పూర్ణస్వాతంత్ర్యమున్నది. ఈ చరిత్రలో జ్యోతిషదృక్పథంలో చూపిన రామజీవితచ్ఛాయ, రాముని స్వకార్యాచరణకొక సూచన మాత్రమే.

మనలోని దైవశక్తిని ప్రయోగించి, మనం మన భవి ష్యజ్జీవితశోభను, ముందుగానే చూపగల గ్రహకూటాలను సృజిస్తాము గాక !

తల్లి చనిపోయేసరికి రామునికి ఒకయేడు. అక్క గారైన సీతాదేవి, మేనత్త ధర్మకూరి రాముణ్ణి పెంచి పెద్ద వాణ్ణిచేశారు. తల్లిపాలు లేనందున సీతారాముడు శిశుదశలో మహాదౌర్బల్యంగా ఉండేవాడు మేనత్త ధర్మకూరి మంచి భక్తురాలు. నిత్యమూ దేవాలయాలకు, దైవమందిరాలకు వెళ్తూ, సీతారాముని కూడా చంకబెట్టుకొని వెళ్తుండేది. ఆ దేవాలయాలలోని విషయాలు, బాలరామునిలో అవ్య

క్తంగా ప్రభావాన్ని కలిగించాయి. దేవళాలలో వూదే శంఖ ధ్వని అంటే బాలరామునికెంతో ప్రేమ. ఆలయ ఘంటారావం వింటే చాలు బాలుని ఉత్సాహాని కంతులేదు. పోరుబెట్టి ఏడ్చే సమయంలోనైనా సరే శంఖధ్వని వినబడిందా, ఇంక బాలుడు ఏడవడు. పురాణశ్రవణ మన్నా ఈ శిశువుకు అమితప్రేమ. హీరానందుడే బాలరామునికి గల కథాశ్రవణాసక్తిని ఒకసారి ఇలా విశదీకరించాడు :- రాము ఒకప్పుడు మూడో యేడు ప్రవేశించిందో లేదో, ఒకనాటి సాయంత్రం తండ్రి అతనిని కథాశాలకు తీసుక వెళ్ళాడు. ఆ పసివానకు ఏమీ తెలీదుకదా అయినా అతడు, పురాణం చెపుతున్న పండితునివైపు తదేకంగా చూస్తూ నిశ్శబ్దంగా, చివరదాకా వొడిలో కదలక అలాగే కూర్చున్నాడు.

మరునాడు పురాణప్రారంభానికి ముందు ఆలయంలో శంఖం ప్రమోగింది. అదివిని రాముడు ఏడవసాగాడు. మిఠాయీలు పెట్టారు. ఆటవస్తువులిచ్చారు. అవన్నీ ఆ బాలుడు విసిరి పారవేశాడు. ఏడవసాగాడు. తండ్రి ఇంక ఎత్తుకొని, పురాణమందిరానికి బైలుదేరిందాకా ఒకటే ఏడుపు. విషయం కనిపెడదామని, దారిలో తండ్రి ఆగినపుడల్లా, శిశువు తిరిగి ఏడుపు ప్రారంభించేవాడు. పురాణస్థలానికి పోయిందాకా, ఆశిశువు పడేతాపం అంతింతగాదు. పురాణస్థలం జేరారు. శిశువు ఇంక కిక్కురుమన లేదు. రాముని బాల్యంలో ప్రదర్శితాలైన దైవిక లక్షణాలివి.

స్వతస్సిద్ధంగా, శైశవంలోనే ఇట్టి దివ్యగుణాలు కలిగిన రాముడెంతధన్యుడు. ఇట్టి బీజప్రాయ సద్గుణాలకు, కష్టమనుకోక, వివేక వివేచనాదృష్టితో అనుకూల దోహదాలేర్పరచి పెంచిన ధర్మజ్ఞుడు, ఆ మహాసుగుణవతి ఎంతధన్యురాలు! బాలరాముని లోని ఈ లేత దైవలక్షణకిరణాలు చూస్తే, బాలభాగవత శిఖామణియైన ప్రహ్లాదుడొకడు జ్ఞప్తికి వస్తున్నాడు. ప్రహ్లాదునికి నారదుడున్నాడు! ఈయనకెవరు?

ఓం! ఓం!

ఓం

# ప్రాథమిక విద్య

**ఆ** రోజే, రాముడు ప్రాథమిక పాఠశాలలో చేరాడు. ఆయన అసాధారణమైన, అతినిశితమైన మేధశ్శక్తికి, అందరూ ఆశ్చర్యపడ్డారు. మూడేండ్లలో ఆయిదేండ్ల విద్యను గ్రహించాడు. పరీక్షలో ప్రప్రథముడుగా ఉత్తీర్ణుడై, ఒక ఉచిత వేతనాన్ని బహూకృతిగా పొందాడు. బడిలో పాఠాలే కాక, వీటికి తోడు, సాదీరచితమైన పారసీక గ్రంథాలు, అనేక ఉరుదు పద్యాలు కంఠస్థంచేశాడు. ముక్కు-పచ్చలారని పసితనం ఆ కార్యదీక్ష, ఆ వినమ్రత, ఆ విద్యాప్రియత, అనర్గళం-సహజంగా తోటిపిల్లలందరూ కోతికొమ్మచ్చుల్లో తేలిపోతుంటే, రాముని మనస్సు గ్రంథపఠనంలో ఏకాగ్రత పొంది ఉంటుంది. ఈ చిట్టిబాలుడు, సరస్వతీదేవళంలోని బాలపూజారి. ఆటలమీద ఈ బాలుడికి అపేక్ష లేదు. రాత్రింబగళ్ళు, చదువు, చదువే. ఉదయం ప్రైవేటు చదువులో, మిగతా పగలల్లా గ్రామపాఠశాలలో కాలం గడిచేది. ఉదయం మొదలు సాయంకాలందాకా చదువే, ఇక భోజనంచేయను వెళ్ళిన ఒక ఘుంట విరామంతప్ప. కానీ పురాణ శ్రవణమంటే ఇప్పటికీ రాముని కత్యంత ప్రీతి. ప్రతి నిత్యం ధర్మశాలలో మధ్యాహ్నం 2 గంటల వేళ పురాణ శ్రవణం జరుగుతుంది. రాముడు కథాశ్రవణానికి వెళ్ళడానికి ఉపాధ్యాయుని అనుజ్ఞ నడిగాడు. కాని ఉపాధ్యాయుడు ఒప్పుకోలేదు.

బాలరాముని నేత్రపద్మాలలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. అన్నా
నికిపోయేబదులు కథాశ్రవణానికి వెళ్ళుతాను అని బాల
రాముడు ప్రార్థించాడు. పంతులుగారి హృదయం ఆర్ద్రమైంది.
నిత్యం రాముడు కథాశ్రవణానికి వెళ్ళడానికి శెలవు యివ్వ
బడింది పగలు తాను వినిన పురాణ కథను, రాత్రికి ఇంట్లో
బంధువులతో సాంతం పూసగ్రుచ్చినట్లు రాముడు తిరిగి చెప్పే
వాడు. రాముని లేత హృదయంలోని, ఈ శ్రవణ భక్తి ఎంత
ఆరాధనీయం !

ఉపాధ్యాయుడైన షేక్ అహమ్మద్ గారిపై బాలరాముని
కెంతో భక్తి. ఆయనకువారసుడైన మహమ్మదాలీపైకూడ పరమ
ప్రేమ. ఈపాఠశాలను వదలబోయే ముందు, గురుదక్షిణగా
ఇంట్లో ఉన్న ఆ ఒక్క ఆవునూ యివ్వవలసినదిగా రాముడు
తండ్రిని ప్రార్థించాడు. ఎట్టి ఆదర్శ విద్యార్థి ! ఉపాధ్యాయునికీ,
విద్యార్థికీ సంబంధాలు తెగి ఎన్ని శతాబ్దాలు అతిక్రమించాయి ?
ఉపాధ్యాయుడు తన విషయాన్ని మరిచి, విద్యార్థి తన ఆశ
యాన్ని మరిచి, ఎన్ని ఏండ్లు గడిచాయి ? సర్కసులో క్రూర
మృగాలతో, పొట్టబోసుకొను అంతకంటె జంతువులుగా సంచ
రించే ఆటగాండ్ల దృశ్యంలాగా, ఉపాధ్యాయ విద్యార్థుల జీవన
ప్రవృత్తి మారినకాలం ! విద్యయొక్క ఆంతర్యతనే మరిచిన
వికృతకాలం ! మానవుని ఒక జంతున్యూనతకంటె హీనస్థితికి
లాగే విద్యాలయాలు పెరిగిన ఘోరకలి ! ఆదర్శాన్ని
పూర్ణంగా కోలుపోయిన, ఈ వికారకాలంలో, ఈ బాలుని
విద్యాదర్శ జీవితంలోని శైశవరూపమే ఎంత వందనీయం ! ఎంత

శ్లాఘనీయం ! ఆదర్శజీవితాలలోని రహస్యఘట్టాలివి. చుట్టూ ఉన్న వాతావరణం ఎంత హీనంగా ఉన్నా, ఆ జలతరంగాల సంరంభ మధ్యంలోనే, ఈ ఆదర్శమూర్తులు ఎలా తమ సలక్షణ శీలమనే ద్వీపకల్పాన్ని నిర్మాణం చేసుకుంటారో సునిశితంగా చూడదగిన విషయం ! ఫ్యాక్టరీలుగా మారిపోయిన ఈవికృత విద్యాలయాకీర్ణతర గంలో, ఈ బాలుడు, భారత సనాతన గురుకులాశ్రమజీవన దృశ్యాన్ని చూపిస్తున్నాడు ! ఈ బాలవిద్యార్థి నడకలో, ఒకనాటి భారతీయ విద్యార్థి జీవితపు గాంభీర్యత ప్రదర్శిత మవుతున్నది. విద్యార్థులను విద్యానిధులుగా చేయగల దివ్యశీలాన్ని రాముడు ప్రదర్శిస్తున్నాడు. భారతీయ పూర్వగురుకుల జీవన ప్రపంచంలో తేజఃస్తంభాలవలె కనబడుతున్న ఉపమన్యాది ఋషికుమారుల హృదయస్పందనం బాలరాముని మధుర వాక్యాలలో ఈనాడా వినబడుతుంది ? నవప్రపంచమా, బాలవిద్యార్థియైన రాముని వద్ద నీవు విద్యార్థివి కావలసి ఉన్నది. తనకు గురువిచ్చిన విద్యాక్షీరాలను, కృతజ్ఞతాపూర్వకంగా ఈ పాలిచ్చే ఆవును ఇద్దామని తండ్రిని రాముడర్థించాడు. ఉన్నదే ఆ బక్క ఆవు ! పాపము ! ఆ నిరుపేద బ్రాహ్మణబాలుని గురుసేవాదీక్ష, గురువుయెడగల కృతజ్ఞతలోగల లోతులను ఎవరు స్పృశించ గలరు ?

ఓం

# ఉన్నత పాఠశాలలో

రామునికి పదేండ్ల వయస్సులో, తాహసీల్ వజీరాబాద్ జిల్లాలోని నైరోక్ పట్టణవాసియైన రామచంద్ర పండితుడనే బ్రాహ్మణుని కుమార్తెనిచ్చి హీరానందుడు వివాహం చేశాడు. రామచంద్ర పండితుని కుటుంబం మంచి మర్యాదాకలదే, కాని వివేచనలేని శాస్త్రాచారం, హీరానందుని ఇట్లు బలవంతపెట్టింది. రాముని జీవితంలో ఇదికూడా ఒక ప్రముఖ విషయం. ఎదుర్కొనదగిన అవరోధనలన్నీ ప్రత్యక్ష మవుతున్నాయి. ఇట్టి ముండ్ల కంచెల్లో రాముడెలా ముందుకు నడవాలో! పెండ్లంటే, కొత్త గుడ్డలు కట్టుకోవడమనో, పప్పన్నం దినడమనో, పాలకీలో హాయిగా ఊరేగడమనో అనుకొనే యీడు ఈ దంపతులది. ఇట్టి తరుణంలో వివాహం! వేదఋక్కులు తమ పావిత్ర్యాన్ని ఋజువుచేసుకోలేని పతితనంలో వివాహం! మరి వివాహం ఎప్పుడవసరమని మీరంటారు? సనాతన భారతవర్షంలో స్త్రీల గురుకులాశ్రమాలు వేరుగా, పురుషుల గురుకులాశ్రమాలు వేరుగావుండేవి. వాండ్లు వాండ్ల గురుకులాశ్రమాల్లో యుక్త కాలంవరకు సద్విద్యాభ్యాసం చేసేవాళ్లు. విద్యాభ్యాసానంతరం ఆ విద్యను ఆచరణాత్మకంగా రూపొందించాలి. తన జీవిత సక్రమ గమనానికి, భార్య తోడుకావాలనుకున్న వ్యక్తి, తన ధర్మ గమనానికి శ్రుతిగల్పే, పుణ్యవతిని స్వీకరించేవాడు. వివాహంతో

అవసరంలేదు, నా జీవితగమనం ఏకాంగంగానే నడవటం శ్రేయస్కరం అనుకునే వ్యక్తి పూర్ణ బ్రహ్మచర్యము నవలంబిస్తాడు. ఇదీ వివాహాల విధానం ఇట్టి సంస్కార విధానాలు శూన్యంగా, కేవలం వయస్సులో పరిణితి వచ్చిందాకా నిలపడంమాత్రమే చేయడం ద్వారా జరిగే వివాహాలవల్ల వచ్చే సత్ఫలం శూన్యమే. బాల్యవివాహాల ఇంకొక రూపమే, యీవయఃపాక వివాహాలుకుండా! ఇట్టి వికార రూపం దాల్చిన అటూయిటూ కాని ఆచారాల ఒత్తిడి మధ్య రాముని జీవితం నడుస్తున్నది. ఈ బురదలోనే రాముడు పెరుగుతున్నాడు కానీ జలగలాగా కాదు, తామరపూవులాగా రాముడు నడుస్తున్నాడు.

స్వగ్రామానిక షుమారు ఆరుమైళ్లదూరంలోఉన్న గుజరన్వాలాలోనిఉన్న తపాఠశాలలో రాముడు చేరాడు. హీరానందుడు, కుమారుని గుజరన్వాలాలో తన మిత్రుడైన భక్తధనరాముని సమీక్షణక్రింద ఉంచి వెళ్లాడు. ఈభక్తధనారాముడు పవిత్రశీలి ఈతని సన్నిధానమే, రామునిలోని దివ్యత్వమును ప్రబుద్ధం చేయడంలో ఎక్కువ ఉపయోగపడింది. సత్సాంగత్యం నిజంగా ఎంత యోగ్యమైంది! బుద్ధిశాలురుకానీ, అవివేకులుకానీ సత్సాంగత్యంచేతనేకదా ప్రబుద్ధులైంది! దాసీపుత్రుడైన నారదునిలోని తేజం, కొందరు సత్పురుషుల తాకిడిచేత దీపించింది. నారదునిచేత ప్రహ్లాదుడు ఉద్ధరితుడైనాడు. సజ్జనులకు సజ్జనులు దొరకడం పూలకు గాలితోడైనట్లు. రామునిలోని నిక్షిప్త దివ్యత్వమును వెలికి తేవడంలో కొంతతోడుపడిన ఈ భక్తధనారాముడు జహ్వార్ మల్ అనేవాని కుమారుడు. క్రీ. శ. 1843

దిగంబరిగా, ఎండకాలంలో ముదుక గుడ్డలతో ఆతడు చేసే సాధనాలలో ఆతని దృఢసంకల్పం గోచరించేది. ఆయనకు భగవత్కథాశ్రవణమంటే ప్రీతి. వింటూ భక్తి వివశుడై అశ్రుధారలు కార్చేవాడు ఆయన హృదయంలోనుంచి శ్రీకృష్ణస్తోత్రాలు వెల్లివిరిసి ప్రవహించేవి. దానభక్త జీవితాంతంవరకు బ్రహ్మచారిగా నిలచాడు. యోగవాసిష్ఠ పఠనంచేత ధనారాముడు మానవుని రహస్య శక్తులు, భగవంతునితో గల అద్వితీయతను గురించి తెలుసుకున్నాడు. కానీ ఇది అనుభవ గమ్యం కాలేదు. గుజరన్వాలాకు వచ్చాడు. ఒక మహాత్ముని సహాయంతో ఏతదనుభూతి పొందాడు. అసాధారణశక్తి లభించింది. అయన అన్నమాట చెల్లిపోయేది. ఇట్టి తరుణంలోనే రాముడీ సత్పురుషుని సన్నిధిలో ఉంచబడ్డాడు.

రాముడీవృద్ధుని గురువుగా స్వీకరించాడు. పూర్ణ శరణాగతి పొందాడు దానభక్త రామునియందు రామునకుగలభక్తి ప్రపత్తులు, ఉపమన్యుని వంటి ఏ కొద్దిమందిలోనో, ఏకలవ్యుని వంటి ఏ విశిష్ట వ్యక్తులలోనో మనం చూడగలం ధనారాముని మాట రామునికి ఒక ధర్మశాసనం. ఆతని నడగంది ఏ పని చేయడు.

1886 లో రాముడు మధ్యమతరగతిలో ఉన్నప్పుడు ఏదో పనిమీద ఒకసారి అత్తగారి గ్రామమైన వైరోకుకు వెళ్లాడు. కానీ ఆయన భక్తధనా వియోగాన్ని భరించలేక పోయాడు. భక్తధనారాముని కేవలం కలుసుకోవడం కోసరమై ఆ బాలుడు, ధనా ఉన్న బద్దోకీ అనే గ్రామానికి ఎన్నో మైళ్లు

కాళ్ళీడ్చేలాగ నడిచి వెళ్ళాడు. కానీ వెళ్ళేసరికి ధనా రాలేదని తెలిసింది. ఏం చేస్తాడు. ఆయన లోపల విచారానికి అంతు లేదు. అక్కడనుంచి, నడిచీ నడిచి [illegible] గ్రామానికి [illegible] ఉత్తరం వ్రాయడానికి వెళ్ళాడు. గురువుగారికి రాముడు వ్రాసిన ప్రథమ లేఖ అదే. ఆ లేఖలో ధనారాముని, "గురురాయా!, జ్ఞానజన శేఖరా!" అని సంబోధించాడు. భక్త ధనాకు వ్రాసిన లేఖలు పదకొండువందలున్నాయి. ఈ లేఖలలో రాముడు భక్త ధనా యెడ నిల్పుకున్న అఖండభక్తిభావం, ఆయన వినమ్రత, మనస్థితి, శీలనిర్మాణ సాధనాక్రమం సుస్పష్టంగా గోచరిస్తాయి. గుజరన్వాలాలో, ఉన్నత పాఠశాలలో చదువుతూనే అవకాశం చిక్కినప్పుడల్లా తీర్థారాముడు ఆధ్యాత్మిక గ్రంథాలను పఠించేవాడు. భక్త ధనారాముని ఆదేశానుసారం ధ్యానాది సాధనలు చేస్తుండేవాడు.

ఓం

ఓం

# విశ్వవిద్యాలయంలో

రాముడు 1888 వ సంవత్సరంలో పంజాబు విశ్వవిద్యాలయంలోని ప్రవేశపరీక్షలో మొదటితరగతిలో మొత్తంరాష్ట్రం మీద 38 వ వాడుగా విజయం పొందాడు. రాముని వయస్సప్పటికి 14½ సంవత్సరాలు. ఈ విజయంతోటి కష్టాలు పోలేదు. ఒకస్కాలర్‌షిప్ పోయింది. ముందుకు ఒక ఆశాదృక్కును కూడా చూరనివ్వని ఘోరమైన పేదరికం ఒకవైపున రాముని ఎదుర్కొన్నది. ఈపద్మవ్యూహాన్ని రాముడు భేదించాలి. ఒక వైపు తన ఆధ్యాత్మిక మార్గదర్శియైన దానభక్త రాముని వియోగంకూడా రాముని హృదయంలో పరితాపం కలిగించింది. అయినా రాముని ఇచ్ఛ విద్యార్జనం చేయాలనే. తండ్రియైన హీరానందునికి ఇంక రాముడు పైచదువు చదువుకోవడం యిష్టం లేదు. చదివినవరకు చాలు, ఏదో ఒక గుమాస్తా నౌకరిలో చేరి, కొంచెం సంసారానికి తోడుపడవలసినదని హీరానందుడు కుమారుని ఉన్నత విద్యాభ్యాసానికి ఒప్పుకోలేదు. సాంసారికమైన బాధాపాశాలే విధంగా రాముని అభ్యుదయగమనాన్ని బంధించదలచాయి. తండ్రికేమాత్రం ఇష్టం లేదు. ఇంకెవరు సహాయపడగలరు? వెనుకముందు ఆశలేని పేదరికం. కుటుంబ భారంచేత, పేదరికపు ఒత్తిడిచేత ఏదో జీవయాత్ర సాగించమనేది తప్ప ఇంకో చూపు చూడలేక పోతున్నాడు హీరా

నందుడు. ఆయన్నే మనగలం? నేటికి భారతీయ గృహస్థజీవనాలీరకంగా పరిణమించాయి? సర్వ శ్రీమంతమైన భారతగృహం, ద్రదేవతయొక్క ముఖాగా తయారైంది.

తండ్రికి యిష్టం లేకపోయినా, రాముడు 1888 నేలో లాహోరు మిషన్ కాలేజీలో చేరాడు. నెలకు ఒక రూపాయి అద్దెకు వాచ్ హోవాలి వీధిలో ఒకగదిని తీసుకున్నాడు. కాలేజీ జీతం నెల ఒకటికి రు 4-8-0 చెల్లించాలి భోజన ఖర్చు. కటికి దరిద్రావస్థలో ఉన్న తీర్థరామునికీ ధనం ఏలావస్తుంది? కానీ తీర్థరాముని అంతర్యములోగల ఈశ్వర శరణాగతిబలమే, ఆ బాలునికిగల ఏకైక మార్గం. భక్తిధనా సహాయంచేత, ఒక స్కాలర్‌షిప్ వచ్చింది. ఇంకా కొన్ని చిన్న చిన్న సహాయాలు పురపాలక సంఘంవారు చేస్తుండేవారు. రాముడుండే గది వసతిగలది కాదు. అశుభ్రస్థానములో ఉన్నది. రాముడు తన మేనమామకు వ్రాసిన ఒక లేఖలో విషయమిది :—"భగవాన్! నాకు ఏకాంతాన్ని, కాలాన్ని, నిరంతర పరిశ్రమను ప్రసాదించు." ఈ లేఖలో రాముని అప్పటి శీలమును సందర్శించగలం. అపరిమిత శ్రద్ధతో రాముడు విద్యాభ్యాసం చేస్తున్నాడు. తీవ్రపరిశ్రమ, దానికితోడు ఉపవాసాలు, అనారోగ్యనివాసం, వీటివల్ల రాముని ఆరోగ్యం చెడిపోయింది. యఫ్. ఏ. పరీక్షకు కూర్చోలేనంత అనారోగ్యం చుట్టుకున్నది. ఇవికాక ఈ బాలతపస్విని ఎన్నెన్నో కష్టాలు క్రమ్ముకున్నాయి. రాముడు కాలేజీకి వెళ్ళిన సమయంలో, ఆయన గదిలో దొంగలుపడి సామానులు ఎత్తుకపోయినారు. రాముని విద్యార్థి

జీవనయాత్రలోని అడుగడుగూ ముండ్లపైననే నడిచింది. తన ఆధ్యాత్మిక గురువైన దాసభక్తకు ప్రతివిషయం లేఖద్వారా నివేదించుకునేవాడు. తుఫానుమధ్యంలో పయనిస్తూ ఉన్న నావికుడు, దూరంగా కనపడే దీపస్తంభ శిఖరాన్ని లక్ష్యంలో ఉంచుకొని, పయనించినట్లు, రాముడు తన గురుపాద లక్ష్యమును విడువడు. ప్రతి లేఖలో రాముని అచంచల విశ్వాసం, ఆత్మలక్ష్యం, పూర్ణవిరాగం, కనపడుతుంది. ఆ క్రమ్మిన చీకటిలో, తుఫానులో, మన బాలనావికుని హృదయలక్ష్యము ఎలా ఉందో ఈ గురువుకు వ్రాసిన ఒక లేఖ చూస్తే చాలు, మనకు అర్థమవుతుంది :—

"నన్ను మీరు చేరదీసినా, లేక వెలుపలికి తరిమి వేసినా, నాకొకే మార్గం తెలుసు. నాకు వేరే దారి తెలియదు. నాకీ శిరస్సు ఉన్నదని తెలుసు. ఇది ఉంచదగిన స్థానం మీ చరణ సన్నిధే అని తెలుసు!"

ఓహో! ఎట్టి అనన్య శరణాగతి.

1890 లో రాముడు యఫ్. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. రాష్ట్రం మొత్తంమీద 25 వ స్థానంలో వచ్చాడు. అందుచేత విశ్వవిద్యాలయంలో ఒక స్కాలర్‌షిప్ బహూకరించారు.

మళ్లీ తండ్రి తీర్థారాముని చదువు ఆపివేసి, ఏదో ఒక ఉద్యోగంలో చేరవలసిందనిఒత్తిడిచేశాడు. కానిరామునిసంకల్పం సమగ్రవిద్యార్ణవాన్ని ఆపోశన చేయాలని. తండ్రి కేమాత్రం యిష్టం లేకపోయినా, తీర్థారాముడు బి. ఏ. తరగతిలో

ప్రవేశించాడు. హీరానందుడు ఆగ్రహాపరవశుడై, ధనసహాయం మానడమే గాక, భార్యనుకూడా రాముని వద్ద వదలిపోయాడు. ఎలాంటి విషమస్థితి! కానీ రాముడు చలించలేదు. రాముని గుండె, పేరులను చేసిన పదార్థంతో చేయబడిన గుండె అని హీరానందునికి తెలీదు. ఈశ్వరశరణాగతితో, అత్యంతసహన బలంతో రాముడు విద్యాభ్యాసం సాగించాడు. ఒక మాసంలో, ఆయన స్కాలర్‌షిప్ డబ్బులో చాలాభాగం పుస్తకాలకు ఖర్చైంది. ఇంటి అద్దెకు, భార్యాపోషణకు జీతానికి పోగా తానాన్నాళ్లో రోజుకు మూడు పైసాలమీద జీవనం గడపవలసి వచ్చింది. "భగవంతుడు నన్ను పరీక్షచేయదలచాడు బిచ్చగాండ్లు పాపం దినానికి రెండో మూడో పైసలమీద బ్రతకగల్గినప్పుడు నేనెందుకు కాలం గడపగూడదు?" అని ధీరుడై కష్టపర్వతాలను తీర్థారాముడెదుర్కొన్నాడు. ప్రతిదినం ఒక పంజాబీ రొట్టెలకొట్టుకు వెళ్లి రెండుపైసలతో ఉదయం, ఒక పైసతో సాయంత్రం ఆహారం తీసుకోసాగాడు. కొన్నాళ్లు గడిచింది ఆ రొట్టెల వర్తకుడు ఒకపైసకు రొట్టె యివ్వడంచేత కూర ఊరికనే వేయవలసివస్తున్నది. ఇక్కడనుంచి రొట్టె యివ్వడానికి వీలులేదని కఠినంగా నిరాకరించాడు. అప్పుడు రాముడు ఒకపూటనే ఆహారం తీసుకోదలచాడు. ఇది ఈవిధంగా ఉంటే, తడవతడవుకు, గదిలో ఎవరో దొంగలు పడడం, పైగా ఆగది పాడుగది. తేళ్లు, పాములు, మండ్రగబ్బల సృష్టి ఆగదిలోనే ప్రారంభమైందేమో! వీటిబాధ. ఇట్టి కల్లోలజీవితం! ఆహారం సరిగా లేనందున, వసతి సరిగా లేనందున ఒకవైపు అనారోగ్యం.

ఒకవైపు గురువు ధనారామునియొక్క, తండ్రిగారియొక్క సంరంభం. తానొకవైపు ఇట్టి దుస్సహకల్లోలాలలో అవస్థపడుతూ, పైగా తండ్రికీ, గురువుగారికీ ఆర్థికంగా రాముడు తోడుపడుతుండేవాడు. ఎంతశక్తికొలది తోడుపడుతున్నా, దరిద్రదోషంచేత పితృత్వాన్ని కోలుపోయిన హీరానందుని క్రోధం, అప్పుడప్పుడు హీరానందుని ప్రోద్బలంచే స్వార్థవశుడైన గురువు దానభక్తుయొక్క ఆగ్రహం తీర్థారాముని ఆదర్శశీలాన్ని ఝుడిపింపసాగింది. కోసినకొలదీ, ఎంచి గంధపుచెట్టు, సువాసనే విరజిమ్మినరీతి, తీర్థారాముని హృదయంలోనుంచి సౌశీల్యమే ఆవిర్భవింపసాగింది. తీర్థారాముని ఆ అజ్ఞాతదివ్యజీవితరూపాన్ని చిత్రించిన ఈ ఒకరచన చూడండి :—

"కోమలమైన ఆర్యసౌందర్యదీప్తమైన ముఖం రామునిది. విల్లులవంటి గాఢవినీలసుందరములైన కనుబొమల్లో ఆయన హృదయప్రేమ, నిగూఢత గోచరించేవి ఆయన అతివిశాల ఫాలభాగంలో మహోన్నత ధీ బలం ప్రదర్శితమయ్యేది. ఆయన అధరాలలో నవకోమల కన్యామృదులత ఉండేది. చిన్నగుండ్రని చుబుకం- ఆలోచనా నిమగ్నుడైనప్పుడు, క్రింది పెదిమ పై పెదిమను ఒత్తిపెట్టినట్లు కనబడేది. ఈదృశ్యంలో ఆయన సంకల్పశక్తి గోచరించుతుంది. ఎవరైనాసరే ఆయన్ని చూచినప్పుడు, ఆ అసాధారణమైన దివ్యప్రకృతికి, ఆ పవిత్రతకు, ఆ అమాయకజీవితానికి ముగ్ధులుకావలసిందే, కన్యవలె వినమ్రుడు. అతి పరిశుద్ధమైన మనోజ్ఞ శరీరసౌందర్యం. కానీ యీవినమ్రరూపం చాటున ఒక మహాద్భుతాశయ ప్రదీప్తుడైన ఇంకోరాము

డున్నాడు. ఆ నిరాడంబర బ్రాహ్మణ బాలుని మానవజీవితం గంభీరమైంది. నేత్రములందు బాష్పాలలో, హృదయంలో భక్తునికుండే ప్రపత్తిలో, కన్యకకుండే మానశ్రీలో, వీరునికుండే సంకల్ప ధృతిలో, ఈ దివ్యవిద్యార్థి, విద్యాలయంలో ఒక మహా యోధునివలె దివారాత్రాలు పరిశ్రమిస్తున్నాడు.''

రాముడు, ఈరకంగా విద్యాలయ జీవయాత్ర సాగిస్తున్నాడు. దరిద్రం తన సర్వశక్తులతో విజృంభించింది. పాపం, రాముడు ధరించే దుస్తులు అతి నిరాడంబరం మొత్తం కలిపితే మూడు రూపాయలలోపల విలువకలవే. బి. ఏ. చదువుతూ కూడా దేశీయమైన చెప్పులే తొడుక్కునేవాడు ఒకనాటి వర్షంలో, త్వరగా కాలేజీకి పోయేసమయంలో, ఒక కాలి జోడు వూడి కాలువలో పడిపోయింది. ఎంత వెదకినా కనబడ లేదు. తీర్థారాముడు ఏమిచేస్తాడు? మరునాడు రెండోకాలికి ఒక ముసలమ్మ పాతజోడు ఆధారంగా తొడుక్కొని రాముడు కాలేజీకి వెళ్లాడు తరువాత తొమ్మిదిగణాలుపెట్టి ఒక కొత్త జోడాయన కొనుక్కున్నాడు. ఒక్కొక్కప్పుడు లాంతరు చమురుకు, అన్నం మానుకొనేవాడు.

ఇట్టి జీవయాత్రలో ఇంకో కష్టపర్వతం ఢీకొన్నది. బి.ఏ. పరీక్షలో ఇంగ్లీషులో మూడు మార్కులు తక్కువగా రావడం చేత తీర్థారాముడు తప్పిపోయాడు. రామునియందు తీవ్రాభిమానంకల ఉపాధ్యాయులుసైతం విచారంమాత్రమే పడగలిగారు. రాముడు తిరిగి ఇంకో సంవత్సరం బి. ఏ. చదవాలసివచ్చింది. ఇప్పటికే నానావస్థలతో గడిచింది. తిరిగీ గడవడం

ఏరకంగా ? ఆ సంవత్సరమే, ఎవరు 21 ఏండ్లలోపల బి. ఏగానీ, యం. ఏ. గానీ ప్యాసవుతారో, వాండ్లకు ఇంగ్లాండులో గణిత శాస్త్రాభ్యాసానికి ఒక రాష్ట్ర స్కాలర్ షిప్ యివ్వబడింది. రాముడు తప్పకపోతే, రామునికే స్కాలర్ షిప్ వచ్చేది. ఇంక ఏ ఆశాలేదు. బి. ఏ తప్పడంచేత, ఇదివరకు ఇస్తున్నటువంటి స్కాలర్ షిప్ కూడా పోయింది. కానీ ఇప్పటికీ తిరిగి రాముని దీక్ష చదవాలనే. కానీ మార్గంలేదు ఈ విద్యాప్రేమలో రామునికే ప్రాపంచిక లాభదృష్టి లేదు విద్యమీద ప్రేమే ఆయన విద్యాకాంక్షకు కారణం. ఎటుచూచినా నిరాశా తమస్సులు క్రమ్మాయి. చెప్పుకోదగిన బంధువు ఆయన కెవరున్నారు ? ఈ కల్లోలమయ జీవిత సంరంభ మధ్యంలో నడుస్తున్నా, తన అంతర్యంలో ఎవని పాదాబ్జానకు దృఢ విశ్వాసమనే బంగారు పీఠాన్ని నిర్మించుకుంటున్నాడో, ఆ పరమేశ్వరుని, ఆ భగవంతుని పాదనఖాల వెలుగే, నిరాశాంధకార గర్భంలో తీర్థారామ గోస్వామికి నాడు గోచరించింది తన గదిలో ఒక మూల కూర్చున్నాడేకాంతంగా. రాముని నేత్రాంచలాలలో నుంచి మంచి ముత్యాలలాగా కన్నీళ్ళు జారుతున్నాయి. ఆయన హృదయపులోతులలోనుంచి శరణాగతి స్తవగీతం బయలుదేరింది.

"త్వమేవ మాతాచ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవ దేవ"

"దేవదేవా! ఇప్పుడు నీకంటే యీ శ్రీరామునికి సహాయం చేసేవాండ్లు ఎవరూ లేరు. నేను నీవాణ్ణి. నీవు నా వాడవు. నీ ఆజ్ఞాప్రకారం వర్తించడమే నాపని. నిన్ను జ్ఞానంతో సేవించడమే నాపని. ఈ సత్సంకల్పాన్ని అనుసరించేట్లు నాకు సహాయంచెయ్యి. నేను పూర్ణశరణాగతుణ్ణి. ఆత్మార్పణం చేస్తున్నాను. ప్రభూ! పాలముంచినా, నీటముంచినా నీవే. నీ యిచ్ఛ నెరవేరుగాక!"

ఆ చీకటిగదిలో రాముడు వెక్కి-వెక్కి ఏడ్చాడు. ఆ బాలభాగవతశిఖామణి కన్నీళ్లు భగవత్పాద సన్నిధికి ప్రవహించాయి. మరునాడు రాముడు కాలేజీకి వెళ్లేసరికి జాండ్ మల్ అనే మిఠాయి వర్తకుడు తనకు తానే స్వయంగా వచ్చి, ఒక సంవత్సరం వరకు తన ఆతిథ్యం స్వీకరించవలసిందిగా రాముని ప్రార్థించాడు. ఇదివరకుకూడా అప్పుడప్పుడితను రామునికి భోజన వసతి, ఉండడానికి వసతీ యిచ్చి తోడుపడుతుండేవాడు. పరమాత్మ, ఈ విధంగా జాండుమల్ రూపంలో అనుగ్రహించాడు. ఈశ్వరప్రేరణచే, ఇతరులుకూడా అనేకవిధాల రామునికి సహాయంచేశారు. జాండ్ మల్ మిఠాయివర్తకుడు! నిజం! అతని హృదయంకూడా ఒక తియ్యని ఏదో మిఠాయే! అప్పుడప్పుడు అత్యవసరసమయాల్లో మేనమామయైన రఘునాథమల్ కూడా ధనసహాయం చేశాడు. ఒకసారి విచిత్రం—ప్రిన్సిపాలుగారు రాముని పిలిచి, నీ కిమ్మని యెవరో యిచ్చిపోయినారని రు 53 లు ఇచ్చాడు. కానీ రాముడు "అంతమొత్తం నాకు వద్దండి. సగం నాకు చాలు మిగతాసగం కాలేజీకేదైనా పనికి

వినియోగించండి. లేదా, నా జీతంలో సగం కడుతున్న ఉదార
శాలియైన గణితశాస్త్రాధ్యాపకులు గిల్బర్ట్సన్ గారికి ఇవ్వండి"
అని మొత్తం డబ్బు తీసుకొను ఒప్పుకోలేదు. కానీ ప్రిన్సిపాలు
బలవంతంచేసి ఆ డబ్బు రామునికిచ్చాడు. పీనికి తోడు ప్రేవేటు
ట్యూషన్లు చెప్పసాగాడు. తనపనుల ఒత్తిడిలో నలిగిపోతూ
కూడా, తనకున్న బోధనాప్రేమచేత, ఔదార్యగుణంచేత,
ఉచితంగా కూడా కొందరికి బోధించేవాడు. విశ్వవిద్యాలయ
వేతనం రు 30 లు కూడేవరకు, యీలాగా రాముడు చెమ
టోడ్చేవాడు భగవానుడిట్టి భక్తునికి తోడుపడకపోతే ఇంకెవరికి
తోడుపడతాడు! జీతం కట్టవలసిన సమయం వచ్చింది ఒకసారి.
వ్యవధి లేదు. రాముడేం చేయ్యాలి? రాముడు మార్గం ఆలో
చించే సమయంలో రాముడు సత్ప్రవర్తన, ఆతని పరిశ్రమ,
బుద్ధిప్రకాశాన్ని తెలుసుకొని ముగ్ధుడైన గిల్బర్ట్సన్ వెలుపలికి
పిలిచి ఒక కాగితం పొట్లం జేబులో పెట్టాడు. ఇంటికి పోయి
రాముడు చూచుకొనేసరికి పొట్లంలో రు 30 లు ఉన్నవి.

ఎవరైతే భగవంతునికొరకు ఒక చేయి చాపుతారో
వారికొరకు భగవంతుడు రెండుచేతులు జాపుతాడని వృద్ధజనుల
ప్రతీతి! ఇది ఎంత సత్యం! శరణాగతి యొక్క ప్రభావం
అమోఘంకదా!

రాముడు బి. ఏ. పరీక్షలో అఖండవిజయం పొందాడు.
పరీక్షలో రాముడొక అద్భుత రచనచేశాడు. పరీక్షకుడు గణి
తంలో పదమూడు ప్రశ్నలిచ్చి వాటిలో ఏ తొమ్మిదైనా చేయ
మని కోరాడు. రాముడు పదమూడు ప్రశ్నలకు జవాబు వ్రాసి

వాటిల్లో ఏ తొమ్మిదైనా పరీక్షింపవలసినదని కోరాడు. విశ్వ విద్యాలయంలో ప్రథానస్థాన మలంకరించాడు. బహుమానాకృతు లతోపాటు రెండు స్కాలర్ షిప్పులుకూడా రాముడుపొందాడు.

తరువాత రాముడు ఫోర్ మెన్ క్రిష్టియన్ కాలేజీ వదలి 1893 మే లో తనకు అతిప్రియమైన గణితంలో యం. ఏ. చదవ డానికి గవర్నమెంటు కాలేజీలో చేరాడు. రాముని వయస్సి ప్పుడు 19½ సంవత్సరాలు. రాముడు ధనభక్తరామునికి యీ కాలంలో వ్రాసిన లేఖలు చూస్తే, రామునిలో అంత కంతకు పెరిగిపోతున్న దైవభక్తి, గాఢమైన శరణాగతిభావం ద్యోతక మవుతుంది. సేవాభావం రామునిలో దినదినాభివృద్ధి పొందసాగింది. తోటి విద్యార్థులకు, అధ్యాపకులకు రాముని సహాయ భాండారం నిరతం తెరచి ఉండేది. తనకెంత పని ఉన్నాసరే, ఏ తోటివిద్యార్థియైనా ఏదైనా ప్రశ్న అడిగితే, వానికి అతి ప్రేమతో రాముడు తోడుపడేవాడు. యం. ఏ. చదివేటప్పుడు, ఫోర్మెన్ క్రిష్టియన్ కాలేజీలో గౌరవ గణిత శాస్త్రాధ్యాపకులుగా తాత్కాలికంగా పనిచేశాడు. తానా విద్యాలయ విద్యార్థి కాబట్టి, ఆ విద్యాలయానికి ఈ సేవ కృతజ్ఞతగా తీర్థారాముడు భావించాడు. ఒకే విషయంమీాద కనీసం నాలుగైదు గ్రంథాలు పఠించేవాడు. ఉపాధ్యాయు లందరికీ రాముడాదర్శం. విద్యార్థులలో రాముడే ఆదర్శం. బి. ఏ. ప్యాసైన పిదప సివిల్ సర్వీసుకు స్కాలర్ షిప్ దొరికే అవకాశము రామునికి ఉన్నది. కానీ రాముడు విద్యా ప్రబో

ధకుడగనో బ్రహ్మ విద్యాప్రచారకుడుగనో వుండాలని లక్ష్యం పెట్టుకోని, దపదవిని సైతం తృణీకరించాడు.

రాముడు ఒక్క నిముషంకూడా వృథాపోనివ్వడు. చేతులు పనిలో, హృదయం భగవంతునిలో ఉంచి రాముడు ఆదర్శ జీవితరూపచిత్రాన్ని వ్రాసుకుంటున్నాడు. ఒక మహా సిద్ధికై పంచాగ్నిమధ్యంలో ఘోరతపంచేసే ఒక తాపసివలె, తీర్థారాముడు, దేహాభావాన్ని అంతకంతకు నిరంతరకృషిలో అరగదీస్తున్నాడు. ప్రతి విధానంలో రామునిలో ఒక ఆదర్శం కనబడుతుంది. ప్రతి క్షణాన్ని రాముడు తన మనోవికాసానికి ఎంత సుసిశితంగా ఉపయోగించుకున్నాడో వ్రాయడం చేతకాని పని. తన మార్గానికి అడ్డువచ్చిన గండశిలలను వివేక వివేచనా బలంతో, తను లక్ష్యించిన జ్ఞానశిఖరస్వర్గమెక్కడానికి మంచి రత్నసోపానంగా చేసుకున్నాడు. ప్రకృతియొక్క ప్రతి శోధనకు బోర్లపడక ఈ బలశాలి ముందుకే గమించాడు. ఈ విశ్వవిద్యాలయ పరీక్షా పరిశ్రమ విజయాలయొక్క బాహ్య సాధనాలద్వారా, రాముడు ఎంత లోలోపల సత్యసంస్కార విజయపు హద్దులను సమీపించగలిగాడో జీవితం చదువుతూ మనం సూక్ష్మంగా వివేచించుకోవాలె. అందరిలాగానే కేవలం పట్టపరీక్షల విజయాలకే ప్రధానత రాముడివ్వలేదు. విద్యాలయ రంగమనే జీవితస్థలిపైన రాముడు వహించిన పాత్రయొక్క గాంభీర్యతను మనం కథాగమనంలో మరువకూడదు. మానవుడు ప్రచండంగా క్రమ్మిన వ్యతిరేక వాయువుల (పరిస్థితుల) అంతర్యాన్ని గ్రహించి, వానిని తమ పురోగమనదోహదాలుగా

వుపయోగించుకోవడంలోని కళాగాంభీర్యాన్ని రాముని విద్యార్థి జీవితంలో మనం అధ్యయనం చేయాలి.

తండ్రి ఇంత వ్యతిరేకియైనా, ఆయన అపదృష్టికి వ్యతిరేకిస్తాడేగాని, తన కుమార ధర్మాన్ని రాముడు తృణీకరించడే. తన స్కాలర్ షిప్‌లోనే, ఏదో కొంత మిగిలించి, ఒక్కొక్కప్పుడు సొంతంగుండా సహాయంగా పంపేవాడు. తన గురువుకు ఈ క్లిష్టపరిస్థితుల్లో సహాయం చేసేవాడు. ఇందులో తనతోటి బాలురకు సహాయం, తండ్రి పెట్టే కడగండ్లకు, ఆయన వ్రాసే స్ఫురలేఖలకు, రాముడు సమాధానాలుగా వ్రాసిన లేఖలోని ఆదర్శం, ఎంత పూతమైంది! అప్పుడు గురువుగారు కూడ సామాన్య దృష్టిలోకి జారిన పరిస్థితుల్లో విద్యార్థి రాముడు, భీష్మునివలె గురుభక్తి అనే గురువును విడువక, గురువులోని అధర్మ గుణాలను ఎంత మనోజ్ఞంగానో సంస్కరించాడు. రాముడింత కష్టపడింది డిగ్రీలకోసరం కాదు. ఈ డిగ్రీలను, ఎలా వుపయోగించుకోవాలో చూపడానికే.

1895 లో, 20 సంవత్సరాల వయస్సున రాముడు గణితశాస్త్రంలో యం ఏ. అత్యుత్తమస్థానంలో ప్యాసైనాడు. ఏ భారత విశ్వవిద్యాలయంలోగూడా, ఆయేడంత కఠినంగా గణిత పరీక్షాపత్రాలు లేవట. రాముని అఖండ కృషి, శేముషీ యం. ఏ. ను విజయకరం చేసింది. ఈజగజ్జీవన ప్రవాహంలో ఈది ఈది ఒక రేవు చేరాడిప్పుడు రాముడు ఈ పరిశ్రమ, అంతర్గతమైన ఆధ్యాత్మిక రత్నాకాలను శుద్ధిపరచడంలో ఒక సాధనగా రాణించింది. తరువాతకథనం వినండి. ఓం!

ఓం

# గృహస్థాశ్రమం

రాముని గృహస్థాశ్రమ జీవనంలోకూడా ప్రకాశించిన ఆదర్శ ధర్మసూత్రాన్ని మనం అవలోకించాలె. రాముని జీవితంలో మానవుని పరిణామంలో కావలసిన సాధనాసామగ్రంతా లభిస్తుంది.

యం. ఏ. ప్యాసైనాడు ప్రతి భారతీయ పట్టభద్రుని ముందూ ఎదురయ్యే సమస్యాపర్వతమే రామునికికూడ ఎదురైంది. రాముని తండ్రీ, బంధువులూ, మావాడు మంచిగా సంపాదించాలనే ఆశతో ఉన్నారు. రామునికి ఉద్యోగసమస్య ఎదురైంది. కాలేజీ ప్రిన్సిపాలు ఆయనను ప్రావిన్సియల్ ఎగ్జిక్యూటివ్ సర్వీసుకు పోవలసినదిగా సలహా యిచ్చాడు. రాముడు తలవంచుకొని చెమ్మగిల్లిన కండ్లతో ఇలా అన్నాడు. "నేనంతగా కష్టపడింది - నాఫలాన్ని అమ్ముకోవడంకోసం కాదు. పంచిపెట్టడానికి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా ఉండడంకంటే ఉపాధ్యాయుడుగా ఉండడానికి నేను వాంఛిస్తాను."

ఉద్యోగాన్వేషణలో రాముడు కొంత శ్రమపడక తప్పలేదు. కొన్నాళ్లు 1995 లో యఫ్. ఏ, బి. ఏ. విద్యార్థులకు ప్రైవేటుస్కూలు తెరిచాడు. తీవ్రపరిశ్రమలచేత శరీరారోగ్యముకూడా కోలుపోక తప్పలేదు. ఆరోగ్యం కోసం

కొన్నాళ్లు స్వగ్రామంలో ఉండి తిరిగివచ్చి లాహోరు సనాతన ధర్మసభా విద్యాసంఘు కార్యదర్శిగా పని చేయసాగాడు.

1895 సంవత్సరాంతంలో అమెరికన్ మిషన్ హైస్కూలులో సెకండుమాస్టరుగా చేరాడు. నెలకు రు 80 లు జీతం. రాముని సౌశీల్య బోధనా విశేషాలకు ఆకర్షితులై వేలకువేలు విద్యార్థులు చేరసాగారు. రాముని గృహం, రాముని హృదయమే. ఏ విద్యార్థియైనా సరే రామునికి ఆత్మసముడే. ఆయన జీతమంతా బీదవిద్యార్థుల జీతాలకే చెల్లు. ఆయన పద్దు వ్రాసి, ఏ ఆకలి అయిన పిల్లవాడైనాసరే కొట్లో పాలు త్రాగవచ్చు. నిత్యజీవితానికి పూర్వం మాదిరే ఒడుదుడుకులు తప్పవు. రాముని విశాల ప్రేమలో ముఖ్యులుగాని విద్యార్థి లేడు. విద్యార్థులకు రాముడెక్కడనుంచో దిగివచ్చిన ఏదో ఒక ప్రేమ దేవతే.

1896 లో రాముడు కొన్నాళ్లు మిషన్ బోర్డింగు వసానుకు సూపరింటెండెంటుగా పనిచేశాడు. ఒకటి రెండు మాసాలు గడిచిన వెనుక, తీర్థరాముడు లాహోరు ఫోర్మన్ క్రిష్టియన్ కాలేజీలో గణిత శాస్త్రాధ్యాపకుడుగా ప్రవేశించాడు. రాముని శరీరం ఏయే పదవులలో పనిచేస్తున్నా, ఆయన హృదయ మాత్రం స్తబ్ధత వహించి, తన ధర్మ శిఖర యాత్రను ఆప లేదు దినదినం, తీర్థరాముని ఆంతర్య జీవితంలో ఒక శుభ కాంతినే విరజిమ్మింది. నిత్యపారాయణ చేసుకొనే గీతాది ధర్మగ్రంథాలు, రాముని ప్రతియదుగులో ప్రదర్శితాలైనవి. ఎంత జీతం వచ్చినాసరే, అది అతిధ అభ్యా

గతుల సమర్చనకే సరిపోయేది. ఆయన చేతులకు సహాయం చేయడమే తెలుసు. ఆయన నోటికి ప్రేమవాక్యాలే తెలుసు. ఆయన కండ్లకు దయాదృక్కులే తెలుసు. ఆయన హృదయానికి ధర్మలక్ష్యమే తెలుసు. ఎవరువచ్చినా రామగృహం ఒక కాశీ అన్నపూర్ణాసత్రం. ఒకవైపునుంచి తండ్రికి, గురువుకు సహాయం చేస్తుండేవాడు. ధర్మశోపులోని ఒక విశాలమైన మామిడిచెట్టును, అపిసిసగొట్టు అల్లరి పిల్లలు ఎగబడి కొమ్మలు కొమ్మలు విరుచుకున్నట్లు రామనాంత ఫల వృక్షాన్ని ఎవరైనా సరే తమ ఆత్రతకొలది విసువసాగారు. కాని ఓహో, ఎన్ని బోయినా, ఏవి పోయినా, రాముడు నిశ్చలుడై, ప్రేమ వివృత బాహువులను ముడుచుకోలేదు. రాముని గృహస్థ జీవనంలోని నిరంతరత్యాగం చూస్తే, భారతామ్నాయంలోని సకృత్ప్రస్తుని అమోఘకథకు ప్రాణం వస్తున్నది. సర్వం పోతున్నా, తమలోని విశాలత్యాగదీప్తిని పోగొట్టుకోజాలని ఇట్టి ధీరులనైరాగ్యంబహుముఖాల ఆర్యఋషులు సంకీర్తించారు. స్వార్థపరులు తమకోసమని ఎంత త్యాగం చేస్తారో, మహాత్ములు ఇతరులకోసం అంత త్యాగం చేస్తారు. ఇదే తేడా. గృహస్థాశ్రమమంటే కూడబెట్టుకొనే జాలెసంచి అని జనుల తలంపు. హిందూ ఆదర్శ దృష్టి ఇదికాదు. గృహస్థాశ్రమమంటే త్యాగాభ్యాసశాల అని హైందవ దృక్పథం. గృహమున్నవాడల్లా గృహస్థుడు కాడు. ఎవడు ఒక చెట్టుక్రిందవున్నా, తన నివాసాన్ని పరులకు ఒక గృహప్రాయం చేస్తాడో ఆతడే గృహస్థుడు. ఎవడు పరమ సత్యమైన భగవంతుని గృహంగా చేసుకుంటాడో అతడే గృహస్థుడు.

అంతర్గతంగా సన్యాస (త్యాగ) సూత్రం లేనిది ఏ ఆశ్రమమూ ఆశ్రమం కాదు. లోపల ప్రతి ఆశ్రమానికి సన్యాస సూత్రమే ఆధారం ! రాముడిట్టి పురాభారత గృహస్థ సౌందర్యాన్ని, నవ్యజీవితరంగంపైన నూపించాడు. రాముని జీవితం చూస్తే, యీ వికృత ప్రపంచాన్ని మరిపించే ఏదో ఒక అతీత వృష్ట లోకం కనపడుతుంది. రాముని జీవితం చైతన్య ప్రభువుల గృహస్థ కథనంలాగా ఉన్నది. శరీరం గృహంలోవున్నా రాముని హృదయం భగవంతునియందే ఉన్నది. రామునికి భగవద్గీత ప్రాణం. భగవద్గీతను పఠించి పఠించి తల్లీనుడైనాడు. గీత యొక్క ఆదర్శరూపమైన శ్రీకృష్ణభగవానునియందు తీర్థా రాముని చిత్తం విలీనమైంది. దేహం, బాహ్యకర్మలు ఏదో చేస్తునే ఉన్నవి. కానీ రాముని కాకర్మలు భగవచ్చింతనలో చేయనట్లు ఉండేవి. ఇట్లు ఉద్ధృతమై పొంగి ప్రవహించిపోతున్న రామ వైరాగ్య జీవనప్రవాహతీరానికి, తండ్రిగానీ, గురువుగానీ, సమీపించలేకపోయారు. ఆ ప్రవాహాన్ని అడ్డు పెడదామని హీరానందుడు అనుకున్నా, ఆ ప్రవాహ విరాగ గర్జనం, అతణ్ణి ప్రకంపితుణ్ణి చేసింది. రామప్రవాహ గర్జనలో, మిగతా జనుల రొదలు ఏమూలలోనో కలిసి అణగారిపోయినవి. రామ ప్రవాహ గమనం ఉద్ధృతమైంది. దాని లక్ష్యం ఉరికి పోయి భగవత్సాగరంలో దుముకడమే.

రాముని సతీమణి సైతం మహోత్తముగాలే. రాముని సాక్షాద్దైవముగా ప్రతి ఉదయసాయంకాలాలలో ధ్యానం చేసేది. రాముడుకూడ ఆమెను దివ్యతేజంగా దర్శించాడు.

భార్యా భర్తలు, ఒకరికొకరు నరకద్వారాలు కాక ఒకరి కొకరు వైకుంఠ ద్వారాలుగా సాధనలు చేసుకొనేవారు. వారి నాటి సంబంధం సీతారాముల సంబంధంవలె పునీతమైంది. రామునికి గృహస్థజీవనంలోగల నాటి పునీత దృష్టి ఉన్నత మైంది. ఒకనాడెందుకో భార్య, 'నన్ను గుర్తుంచుకుంటారా?' అని అడిగిందట. రాముడు "ఉంచుకోను. ఎందుకుంచుకోవాలె. నా ముక్కుందని, నా చెవి ఉందని, నాకంఠమున్నదని, నా హృదయ ముందని గుర్తుంచుకుంటున్నామా. ఏదో జబ్బుచేసినప్పుడే, మాటికీ ఫలాన ముక్కు నాకున్నదని జ్ఞప్తికి వస్తున్నది. నీవు నేనే, మరెందుకు జ్ఞాపకం" అన్నాడు. ఒహో! ఎంత ఆకాశా లకు అధిగమించిన దైవిక దాంపత్యం! ఎట్టి విశాలదృష్టి! ఆర్యులు తమ శాస్త్రాలలో గానం చేసిన గార్హస్థ్యం, ఇదీ అని మనం నిరాఘాటంగా చెప్పుకోవచ్చు

ఒక్కమాట! రాముని దివ్యత్వజీవితపులోతును గూర్చి ఒక విషయం చెబుతాను అర్థమవుతుంది.

తెల్లవారినూస్తే, రాముని శయ్యంతా కృష్ణవిరహాశ్రు వులతో తడిసి ఉండేది, అని రాముని సతీమణి చెప్పేది. గారాం గూడా ఇతడు? పూర్వపశువాసనలకు తావలమైన ప్రాకృతజీవన ప్రపంచంలో ఈ నవయౌవన మోహనమూర్తి నిలువక ఒక అందరాని నిస్సంగ శిఖరాలకు ఎగబ్రాకుతున్నాడు. సతీమణి యొక్క మృదుశీకరములు, రామపరమహంస జ్ఞానదృష్టితో తినివేశాడు. ఇంకా ఆమె కరములు ఆయనకు కామపాశాలు ఎలా అవుతాయి? భార్యముఖంలో, రామునికి భక్తిభావంచేత,

దివ్యసాధనలచేత అంతకంతకు భగవంతుని ముఖబింబమే కనబడ సాగింది. ఏ ఏ వస్తుజాలం, ఇతరమానవులను పశుదశకు గుంజుతున్నాయో, ఆ ఆ వస్తుప్రపంచమంతా, అంతకంతకు రాముని హృదయనేత్రాలకు భగవంతుని చూపించే దీపాలుగా మారసాగాయి! భక్తి అంజనంచేత చీకటి రామునికి వెలుతురై దారిచ్చింది. రాముని అంతకంతకు దివ్యశిఖరాలకు తీసుకపోయిన ఆ భక్తిరూపాన్ని దర్శిద్దాం.

ఓం

౭౦

# శ్రీ కృష్ణ ప్రణయం

ఆచార్యుడైన నారదునివచనం :— "భగవంతుని లేశ విస్మృతియైన ఎవనికి మరణవేదనకలిగిస్తుందో, అదే భక్తిస్థాయి" అని. నిజం! నిజం! రాముడిట్టి స్థితికి అధిగమించాడు. గోపికలు, గౌరాంగాదులు అనుభవించిన మహాస్థితికి రాముడు అధిరోహించాడు. రాత్రింబవళ్లు రామునికి కృష్ణగుణానుభవమే. కృష్ణ ప్రేమోద్దీపనం రామహృదయంలో పొంగులుపారింది. రాముని మహాభావాశ్రుధారలు యమునగా పారసాగినవి. రాముని హృదయం బృందావనంగా మారింది. ఎవరైనా వేణువుపాడితే చాలు - అది వినబడితే రాముడది కృష్ణవేణురావమని పరవశుడై పడిపోయేవాడు నెమలిపింఛం కనబడితే పరవశుడయ్యేవాడు. ఇతరప్రసంగాలు లేవు. ధర్మాన్ని గురించి, శ్రీకృష్ణుని గూర్చే రాముని నిరంతర గోష్ఠి. కృష్ణనామం వినబడితే చాలు రాముడు భావసమాధి నిమగ్నతపొందేవాడు. లాహోరులో ఆయన రావీనదీ తీరంలో గంటలతరబడి సంచరించేవాడు. ఆ నదీతీరంలో కృష్ణైకభావుడై, భక్తిభావోన్మత్తుడై విహరించేవాడు. ఆ రాముడు పడిన కృష్ణభావోన్మాదవేదన రాధ పడిందేమో! ఒకసారి రాముడు రావీనదీ తీరంలో తిరుగుతున్నాడు. ఆకాశమంతా మేఘావృతమైయున్నది. రాముడక్కడ ఉచ్ఛై

స్వరంతో ఆక్రందిస్తున్నాడు :— "ఓ కృష్ణా! ఓ కృష్ణా! వచ్చావా నీవు. ఓ వినీలఘనవర్ణ! ఈ మేఘవర్ణం నీదే. ఈ శ్యామలవర్ణం నన్ను ఉన్మత్తుణ్ణి చేస్తున్నది. నీవు ఎందుకు దాక్కుంటున్నావోయి? నీ వెక్కడున్నావో కదా? ఓ మేఘమా! నీవు నాకు చెప్పవెందుకు? నీవు అంతఎత్తులమీద పోతున్నావు గదా! నాకంటె నీకు బాగా కనపడుతుంది. చెప్పు! చెప్పు! నా శ్రీకృష్ణదేవుడెక్కడున్నాడో? అయ్యో! ఓ మేఘమా! నీవు కూడ నల్లగా ఉన్నావు. నీకుకూడా ఆ కృష్ణవిరహశోకమే ఆవరించిందా? నా ప్రియుని దర్శించలేనా! అయ్యో? వాని దర్శనభాగ్యం కలగదా, ఇంకేమున్నది ఈ ప్రపంచ కార్యరసర్వం నన్ను కాటేస్తుంది కదా. నేనెవరికీ వేదన వెళ్లబోసుకోవాలె? ఓ కృష్ణ! నీకోసమేకదా నేను బంధువులనూ, సర్వస్నేహితులనూ మిథ్యాగౌరవప్రతిష్ఠలనూ పరిత్యజించాను." మేఘాలు తిరిగి విడిపోవడం చూచి రాముడు ఇంకా ఈ విధంగా విలపింప సాగాడు :—

"ఓ తమ్ముడా! మేఘమా! వెళ్లితే వెళ్లావు. నీవు వెళ్లి, నా విలాపసమాచారాన్ని శ్రీకృష్ణునకు నివేదించు, నివేదించు.

"నీవు వర్షానందమును గోరెదేని
రావోయి, నానేత్రముల నిల్వరమ్ము!
ఇదె నీల ధవళశుభ్రారుణవర్ణ
వర్ష మేఘము దేవ! రావోయి రమ్ము!"

[ఒక ఉర్దూ గీతం]

ఓ జీవితమా ! ఎంతకాలం ! ఎంతకాలం ! నేనిక సహించలేను. నాతృష్ణతీర్చు. లేదా యీ ప్రాణాలు తియ్యి. నీవు కదా సూర్యచంద్ర తారలకు సౌందర్యాన్ని ప్రసాదించింది. నీవేకదా పూవులకీ రంగులు వేసింది. మరి నాకెందుకు నీ దర్శన భాగ్యం ప్రసాదించవు ? జ్ఞానం ఎందుకు ప్రసాదించవు ? " అని రాముడు కృష్ణా ! కృష్ణా ! అని స్మరిస్తూ మూర్ఛాక్రాంతుడైనాడు.

ఇట్టి దివ్యభక్తి భావోద్దీపన రామునిలో ప్రజ్వలించింది. ఆతని నేత్రాంచలాలవెంట భాద్రపద వర్షధారలై బాష్పధారలు జాలువారేవి. ఒకసారి రాముడు ఒక పండితుడు పురాణం చెపుతుంటే వింటూ, భక్తి వివశుడై రోదింపసాగాడు. ఆతని మహావేదన, ఆతని విరహబాధ అందరూ చూడలేకపోయారు. గత్యంతరం లేక పండితుడానాటి పురాణం ఆపివేయక తప్ప లేదు. ఈ స్థితి భాగవత శ్రేష్ఠులైన కులశేఖరాదు లధిగమించిన దివ్యస్థితి. మహర్షి గర్గభగవానుని నిర్దేశిత భక్తి స్వరూపమీ దివ్యస్థితి.

"ఓ నేత్రాల్లారా ! మీరుండి నాకేంలాభం ?
మీరు శ్రీకృష్ణ దర్శనం పొందలేరా, ఎందుకు
మూసుకపోండి, మూసుకపోండి

ఓ చేతుల్లారా! మీరు వాని పాదారవిందాలు స్పృశింపలేరా ! ఎందుకుమీరు ? విరిగిపోండి ! నాశనంకాండి ! ఓప్రభూ! నా ప్రాణం సమర్పిస్తే వస్తావా ? ఇదిగో సమర్పిస్తాను–సంశయం లేదు. రా ! "

అంటూ రాముడు కన్నులవెంట అశ్రుధారలు కారుస్తూ, విలపింపసాగాడు. ఆతని కన్నీటితో తోడిగిన చొక్కా అంతా తడిసిపోయింది. వివశుడై మూర్ఛపోయాడు. కొంతసేపటికి లేచి కండ్లు తెరచేసరికి, ఎదుట ఒక కృష్ణ సర్పం కనబడింది. రాముడు ఆ పామునైపు పరుగెత్తి, "ఓ ప్రభూ! రా, ఈ సర్పరూపంలో వచ్చావా? ఓ దేవా! ఆ గోపికలు ఏ నీదివ్యమంగళాకృతిని చూచి మిడుతలవలె ఆకృష్టులైనారో నాకా దివ్యరూప దర్శనం కావాలె" అంటూ తిరిగి మూర్ఛాక్రాంతుడైనాడు.

ఇదంతా చూస్తున్న ఒక స్నేహితుడు గదిలోక వచ్చి ఇలా అన్నాడు, "గోస్వామిజీ! కృష్ణుడు నీలోనే ఉన్నాడు. ఏమిటి నీవు వెదికేది?"

"నాలోనా" అని ఉన్మత్త రాముడు చొక్కా చింపుకున్నాడు. గుండెను గోళ్ళతో రక్కసిచి చూడసాగాడు!

తిరిగి భక్తివివశుడై రాముడు మూర్ఛాక్రాంతుడైనాడు. కొన్ని గంటలట్లు గడిచాయి. కృష్ణవిరహియైన గౌరాంగునిలో మనమీ మధురస్థితిని చూస్తాము ఎట్టిదీ పరమభక్తి!

1886 ఆగస్టులో రాముడు సుప్రసిద్ధ సనాతన ధర్మప్రచారకుడైన పండిత దీనదయాళుశర్మతో మథురాకు తీర్థయాత్ర చేశాడు. దీనదయాళుడు తరచుగా మథురాబృందావన యాత్ర చేసిన వ్యక్తి. ఈ తీర్థయాత్రలో వారు కృష్ణవిహార స్థలాలు దర్శించారు. ఏ పుణ్యస్థలంలో గోవిందుడు ఆవిర్భవించాడో, ఎక్కడానంద బాలుడు తన బాలలీలా విలాసాలతో జగత్తును

ప్రముగ్ధం చేశాడో, సమస్తప్రదేశాలు దర్శించారు. అడు
గడుగూ బృందావన వీధులలో రాముడు వివశుడై తడబడుతూ
పెట్టాడు వ్రజమండలంలోని తరులతా గుల్మగిరి ప్రదేశాలను
చూచి వాటి యదృష్టమును రాముడు సంకీర్తించాడు. రాముని
పరవశాశ్రుధారలతో గోకులమార్గాలు తడిశాయి. ఏనాడో
మాటుపడిన గోపికా విరహగీతాలు, తిరిగి రాముని ముఖంగా
బృందావనంలో నినదించాయి. పండిత దీనదయాళుడు రాముని
కృష్ణభక్తిని మథురాప్రజలకు కొంత పంచదలచాడు రాముడు
ఉపన్యసించడానికి ఒక బహిరంగ సభ ఏర్పరిచారు. ఆ యుప
న్యాసం ద్వితీయ యమునగా ప్రవహించింది. రాముని భక్తి
తన్మయ మధురప్రసంగానికి ప్రజలు పరవశులైనారు. ప్రజల
నేత్రాలు ఆనందాశ్రుపూరితాలైనవి.

చివరకు రాముని కృష్ణాన్వేషణ ఫలించింది. ఒకసారి
నారాయణస్వామితో స్నానసమయంలో ఇలా అన్నాడు :—
"ఇవ్వాళ శ్రీకృష్ణదర్శనమైంది. నేను స్నానం చేస్తుంటే, ఆయన
వచ్చాడు. పూర్ణదర్శనమైంది నన్ను తిరిగి విరహవేదనా
వహ్నిలో వదలి వెళ్ళాడు." ఇలాగే అనేకసార్లు కృష్ణదర్శనం
రామునికయింది. సనాతన ధర్మసభా పక్షమున, రాముడు
లాహోరులో, ఇచ్చిన ఉపన్యాసాలలో సూరదాసుని తంబుర,
మీరాబాయిగానం నవ్యరూపంతో ప్రజలువిన్నారు. గద్గద
కంఠంతో అస్రుప్రవాహాలతోటే రామోపన్యాసాలు. ఒక
ఉపన్యాసమధ్యంలో రాముడు, "ఓహో! నా కృష్ణుడు నల్లని
వాడని కదా అంటారు. నా హృదయం కూడా నల్లగా ఉన్నది.

అయితే నీ వెందుకు నాలో కలవవు?" అంటూ విలపింప సాగాడు. ఆ ఉపన్యాసం అంతటితో ఆపవలసివచ్చింది.

అమృతసరంలో, రాముని కృష్ణభక్తి సంబంధ మహోపన్యాసాలకే నారాయణుడు ముగ్ధుడై శిష్యుడైనాడు. మొదట ఆర్య సమాజికుడు నారాయణస్వామి. కాని, కృష్ణుడంటే అగౌరవభావం. అట్టివాడు, రామప్రసంగాలచే కృష్ణ తత్వమును దర్శింపగలిగాడు.

రాముని భక్తి మధువును ఎందరో ప్రజలు రుచిచూచి ధన్యులైనారు. విశ్వవిద్యాలయంలో విద్యార్థులను సైతం "కృష్ణా! నాయనా కృష్ణా!" అని సంబోధింపసాగాడు. గౌరాంగుని ఉపాధ్యాయ వృత్తిగా మారింది రాముని అధ్యాపకత్వం! ఎట్టి ఉన్నతభక్తి! రాముని హృదయం ఒక మహా భాగవతం! మహా దుర్లభమైన సగుణ సాక్షాత్కార మహాభాగ్యం రామునికి లభించింది పురాణ శాస్త్రాలలోని కథలు, రామునికి స్వానుభవాలుగా పరివర్తనం పొందాయి! ఎలాంటి తీవ్ర సాధన! హృదయమిట్టి మధుర పరిపాకదశకు రాముడు తెచ్చుకోగలిగాడు! జన్మజన్మాలలో మాకింకేమీ వద్దు అని కులశేఖర ప్రహ్లాదాదులు ఏమహాభక్తిని అర్థించారో రాముడా భక్తిని అనుభవిస్తున్నాడు. ఏ మహాభక్తిని, ఆగమవీధులలో మహార్షులు ఉద్ఘోషించారో, రాముడా దివ్యభక్తిని, తనలో ఆర్ణవంగా పొంగులెత్తించాడు!

౬౦

ఓం

# వానప్రస్థము

రాముడు మహాభక్తిమధుపాన మత్తుడైనాడు. భక్తి యొక్క సమగ్రరూపమైన జ్ఞానశిఖరానికి అధిరోహించ పోతున్నాడు. సగుణదర్శనం పొందిన రాముడింక నిర్గుణదర్శనం పొందనున్నాడు. పరమసత్యముయొక్క ఒకపార్శ్వం సగుణం. ద్వితీయపార్శ్వం నిర్గుణం. రాముని తీవ్రభగవత్ప్రియం, పూర్ణ సాక్షాత్కారశిఖరాలకు తీసుకపోతున్నది. సక్రమపథాలలో కృషిచేసే మానవులను, ప్రకృతిదానంతటదే దోహదం చేస్తుంది. పన్నెండుశతాబ్దాల క్రితం బహుళమిథ్యాసిద్ధాంతములను నిర్జించి, సత్యమతప్రతిష్ఠాపనచేసిన ఆదిశంకరాచార్యుల సాంప్రదాయకులైన శ్రీశ్రీశ్రీ ద్వారకామఠాధిపతులైన పూజ్యపాద జగద్గురు శంకరాచార్య శ్రీమాధవతీర్థస్వాములవారు, లాహోరు రావడం తటస్థించింది. పరస్పరసంగ్రామ సంకులమైన జగతి, మహోన్నతమైన అద్వైతబీజంలోనే శాంతి పొందాలసియుండడంచేత, ఈశ్వరప్రేరణ రామున కీ విధంగా మార్గం వివృతం చేసియుండవచ్చు.

రాముడీరోజుల్లో సనాతన ధర్మసభా ప్రధాన కార్యదర్శి. అందుచేత జగద్గురువులను సేవించడం ఆయన కర్తవ్యమయింది. రాముని విలక్షణ దివ్యగుణాలు శ్రీ శంకరాచార్యులవారిని

గాఢంగా ప్రముగ్ధపరిచాయి. అక్కడున్నన్ని రోజులు, జగద్గురువులు, నిత్యమూ కొన్ని గంటలు అద్వైత శిఖరాలకు రాముని చిత్తవిహంగం ఎగిరేలాగ దివ్యప్రబోధాలు చేశారు. నిత్యమూ రామునికి ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, మొదలైన అద్వైత గ్రంథాలను ప్రబోధించడమేగాక, ప్రత్యేకమైన సలహాలుకూడా స్వాములవారు చేశారు. ఒకవారం ఉండి, తిరిగి జమ్మూకు పడమీదపోతూ, ప్రేమవశుడై జగద్గురువులు, రాముని ఆరోజు తనతో రాగోరారు. ఉద్యోగాదికార్యాలు బహుళంగా చుట్టుకొనియున్నా, రాముడు ఏబంధము లేనివాని వలె వెనుకముందు చూడక, స్వామివారిని అనుసరించారు. ఒక్కరోజే వారిరువురూ కలిసిఉన్నారు. ఎండిఎండిన మంచికట్టెకు నిప్పు అంటుకుంటే ఎలాలు భగ్గున మండవలసిందే. మాధవతీర్థుల దివ్యసందేశం, రాముని హృదయంలో మహత్తరంగా జ్వలించింది. ఈ మహత్తర ఘట్టం చూస్తే, బాలశంకరుడు, నర్మదా నదీతీరగుహా గర్భంలో ఉన్న శ్రీగోవిందపాదుల కడ జ్ఞానదీప్తిని పొందిన ఒక మధురగాథ కన్నులకు కనపడుతుంది. తపేకదీక్షా దురంధరులై తమతమ కర్తవ్యములందు అప్రమత్తులైన ధీరపురుషులకు భగవత్కృప ఇలాగేకదా దారి చూపడం !

భక్తియొక్క పరిపాకదశయైన పరాభక్తి, లేక జ్ఞానం రామహృదయంలో వెలుగొందసాగింది. నానావిధ రూప నామక్రియాదులకు అధిష్ఠానమై అతీతమైయున్న ఆత్మయొక్క సాక్షాత్కార కాంక్ష రామునిలో జ్వలించింది. రాముని కృష్ణ

దర్శన పరితాపం ఆత్మసాక్షాత్కార కాంక్షగా రూపు దాల్చింది. పరిమిత కృష్ణరూప దర్శనకాంక్ష, సమస్తరూపాంతర్గత సత్యాత్మదర్శన కాంక్షగా పరిణమించింది. ఇదే సమగ్ర కృష్ణరూప దర్శనకాంక్ష – తులసీదాసు సైతం, అయోధ్యాపతిగ అవతరించిన రామునే రామునిగదలచి మొదట ఆరాధించి, తరువాత ఆ రాముని రూపధారణకే కాక సమస్త రూప ధారణలకు అధిష్ఠానమైయున్న సత్యరాముని సాక్షాత్కారం పొందుతాడు. ఇదే సమగ్ర సాక్షాత్కారం.

రాముడింక నిరంతర ఆత్మధ్యాన కృషిలో కాలం గడుప సాగాడు. ఆయన కిపుడు ఏకాంతాభిలాష అధికమైంది. నిరతం అద్వైత వేదాంత సాధనలో నిమగ్నత పొందాడు. సమయం చిక్కినప్పుడల్లా వేదాంత విచారం, ధ్యానం, ఏకాంతసేవే రాముని కార్యక్రమం. ప్రహ్లాదునికి హాసలీలా నిద్రాదుల్లో సైతం హరిచింతనే అన్నట్లు, రామునికి, ఆ భగవదైక్యభావమే సర్వస్వంలో పరివ్యాపించిపోసాగింది. ఎవరైనా వచ్చి ఇప్పుడు ఎంతకాలమయిందండీ అని అడుగుతారా, తన గడియారం తీసి చూచి, అడిగినవాని ముఖమును చూచి చిరునవ్వుతో, "ప్రియతమా ! ఇప్పుడు ఒకటి" అని రాముడు సమాధానం చెప్పేవాడు. ఎప్పుడడిగినా అంతే. ఎవరైనా ఉండి, "గోస్వామీజీ ! విచిత్రంగా ఉందే. ఎప్పుడైనా ఒకటేనా గంట. ఇది ఎలా ?" అని అడిగితే రాముడు నవ్వి, "ప్రియతమా ! రాముని గడియారం అలాంటిది. దానిలో ఎప్పుడూ ఒకటే" అనేవాడు.

రాముని వేదాంతసాధనలముందు, ఆయన స్వేచ్ఛ ముందు, బాహ్యావిధుల ప్రాబల్యం నిలుచోలేక పోయింది. ఉద్యోగాదులు నిర్వర్తిస్తున్నాడు. విద్యాలయంలోని కర్మ కుంటుపడదు. ఆయన ఆంతర్యసాధన అంతకంటే కుంటుపడదు. కానీ రాముని వైరాగ్యం, ఆత్మభక్తి, ధర్మరక్తి తీవ్రరూపం దాల్చింది. బంధువులు ఎంత గంద్రగోళపడినా, తపోనిశ్చలుడైన రాముని ఏకాగ్రతకు భంగం కలుగలేదు.

ఇట్టి సమయంలో అగ్నికి గాలితోడైన విధంగా హిందూ వేదాంత కంఠీరవమూర్తి శ్రీ వివేకానందస్వామివారు తన పశ్చిమఖండ దిగ్విజయయాత్రానంతరం, భారతదేశసంచారంలో లాహోరు వచ్చి ఒకవారం ధర్మోపన్యాసాలు చేశారు. సనాతన ధర్మసభాపక్షంలో, రాముడు, స్వామివారి ఉపన్యాసాలు కొన్ని ఏర్పాటుచేశాడు. శివకేశవులవలె వారిరువురి సమాగమం జరిగింది. వివేకానందస్వామివారి సమాగమం, రామునిలోని వైరాగ్య దావానలానికి ఒక జంఝామారుతమై యుండ వచ్చు.

బాహ్యప్రపంచం రామునికి కనపడ్డంలేదు. అంతర్ముఖత వహించాడు. 1898 ఫిబ్రవరి 5 న అద్వైతామృతవర్షిణీ సభను స్థాపించి, రాముడొక సత్సంగమును ఏర్పరిచాడు. అందలి సభికులు సాధువులూ, మహాత్ములు ప్రతిగురువారం సభ. వేదాంతమే అచ్చటి నిరతగోష్ఠి. తనచుట్టూగల బాహ్య జగత్ సంరంభ సాగరమధ్యంలో రాముడొక ఆత్మనిష్ఠాద్వీపకల్పమును ఈ రకంగా సృష్టించుకున్నాడు! ఎంతటి శ్రద్ధ! ఎట్టి ఏకదీక్ష!

ఎట్టి విరాగము? సముద్రమధ్యలో ఒక ద్వీపంపై తపస్సు చేసే కృష్ణద్వైపాయనమహర్షి మన రాముడిప్పుడు!

ఎండాకాలం సెలవులు వచ్చాయి. రాముడు ఏకాంత ధ్యానానికి హరిద్వార, హృషీకేశ తపోవనాలకు పరుగెత్తాడు. చెంత ఉన్న డబ్బు దుగ్గాణి సాధుసజ్జనులకు పంచి పెట్టాడు. కౌపీన మాత్ర పరిధానుడై, నిర్ధనుడై, చంకన ఒక ఉపనిషత్తు మాత్రం ఉంచుకొని, హృషీకేశానికి ఆరుమైళ్ల దూరంలోగల బ్రహ్మపురి దేవాలయ సమీపంలోని తపోవనగర్భంలో రాముడు ప్రవేశించాడు. అతని ఏకైక దీక్ష యింక ఆత్మదర్శనమే! ఆ చీకటి కోనలన్నీ ఆయన విహరించాడు. కొండగుహాలలో రోదించాడు. గంగానదీ కూలంలో తదేకనిష్ఠుడై ఉపనిష్ఠుడైనాడు. ఒకనాడు, విరహాకులుడై, ఒక కొండపైనుంచి గంగలో రాముడు దుమికాడు. చిత్రం! గంగామాత, తనపుత్రుని తరంగహస్తాలతో లాలించి ఒడ్డున ఒకరాతిపై నిలిపింది. రాముడిట్లు ధ్యానయోగంలో సాక్షాత్కార తపస్సు చేసి, బ్రహ్మపురి అరణ్యతమస్సులలో ఆత్మజ్యోతిని దర్శించాడు. జీవితసమస్యను పరిష్కరించుకున్నాడు. ఇరువైతొమ్మిదేండ్లవయస్సులో, దేవదుర్లభమైన ఆత్మసాక్షాత్కార మహాభాగ్యదుర్గమును రామపాదుషా, జయించాడు! వీరునివలె జయించాడు! ఓం! ఓం! ఓం!

రాముడిట్లు వనవాసం చేసేరోజుల్లో, బంధుమిత్రాదుల ఒత్తిడి, హిమాలయ మృగాల అలజడికంటే ఎక్కువగా విజృంభించింది. ఇది ముఖ్యఘట్టం. ఏకోద్దిగాననన్నా వ్రాయంది తృప్తి కలగడం లేదు. మహాబోధిచ్ఛాయల్లో ధ్యాన నిమగ్నుడైన

గౌతమబుద్ధుని సమాధివికల్పానికి, మారుడు ఎన్నో విధాల దండయాత్ర చేస్తాడు శాక్యసింహుడు మారుని నిర్జించి బుద్ధమూర్తిగా నిలిచాడు. అదేమాదిరి, రాముడు, గంగాతీర హిమాలయ వనగర్భాలలో తన ఆశయసిద్ధికై, ఆ నిర్వాణ శిఖరారోహణకై పరిశ్రమిస్తున్న దినాలలో, ఎన్నెన్ని బాంధవ బృందరూపకమైన అలజడుల తుఫానులు లేవాయో విశదీకరించడానికి తావు లేదు రాముడీ మారవిజయం చేశాడు. నటరాజు వలె, తన జ్ఞానబల పాదంక్రింద ఈ మోహారాక్షసుని తుత్తుమురుచేసి, ఆ వనవీథులలో ఆత్మ తన్మయ తాండవం చేశాడు.

ఎందరు హేళన చేశారు? ఎందరు బెదిరించారు? ఎందరు లాలించారు? మహాయోధుడైన రాముడు, ఈ మోహా బంధుని కృత్రిమ ప్రేమాలింగన దీర్ఘ ఘోర బాహు శాఖలను నిశాత వైరాగ్య చంద్రహాస ధార నరికివేశాడు! వర్ణన కాదిది నిజము నిజం!

చెడు గెలవలేనప్పుడు మంచిరూపంలో కూడా వస్తుంది. వివేకశాలురది గ్రహిస్తారు. రావణుడు సీతను ధర్మరేఖలను ఋషిరూపంతో దాటించాడు. అంతే మాయామృగప్రభావం. చూడండి. చివరకు కొంత ఆధ్యాత్మికజ్ఞాని, గురువు అయిన ధ్యానభక్త సైతం, సామాన్యునివలె రాముని తపోభంగానికి గాని పడ్డాడు. ఇంటికి రమ్మని వ్రాసిన గురులేఖకు జవాబుగా వ్రాసిన రామలేఖ ఒకటి ఇది. రాముని ధీరతను దర్శిద్దాము :

హృషీకేశ ప్రాంతం, 1898 ఆగస్టు 23

నన్ను ఇంటికి రమ్మని బోధిస్తూ వ్రాసిన మీ ఉత్తరం నాకు చేరింది. వెంటనే దానిని పరంధామానికి పంపించాను. అంటే గంగార్పణం చేశాను. ఇల్లువదలినందుకు నాకు విచారముకలిగినదా అని అడిగితే అది మీ అపార కరుణ.

" అవ్యక్తాదీని భూతాని వ్యక్త మధ్యాని భారత !
అవ్యక్త నిధనాన్యేవ తత్రకా పరిదేవనా "

" మధ్య తప్ప ఆది అంత్యాలు తెలియని వస్తువులకోసం పరితపించడం దేనికి ! "

ఇతరప్రజలు నా మీద మోపిన నిందలకు నేనిలా చెప్పవలసియున్నది :

"పెమీదగుడ్డలో బైలు వెరియును
నేను వచ్చితిని గంగాతీరమునకు
వారిష్టమొచ్చిన పగిదిగా నన్ను
నిందింపగా నిమ్ము పరవేమిలేదు
వేయినిందలుగాని నాకేమి భయము !"

ప్రభూ ! నేను నీ ఆజ్ఞలే నెరవేరుస్తున్నాను. నా సత్య గృహానికి చేరడానికి నేను ప్రయత్నిస్తున్నాను. మీ సత్యాత్మలో నేను కలియగలను. (నెత్తురు, వీర్యము, మూత్రము, చెమట, ఉమ్మి) అనే అయిదు నదులు కలిసిన * పంజాబు మనశరీరం. ఎవరైనాసరే ఈ ప్రదేశాన్ని విడిస్తేనేగాని నిజనివాసమైన హరిద్వారాన్ని (సత్యద్వారము) చేరలేరు.

* పంజాబు—అంటే ఐదు నదులు కలిసిన దేశమని

ఇప్పుడు రాత్రి పదిగంటల సమయం. మసిపిపోలుకున గుండా లేదు. లోపల సోహం శబ్దం గర్జిలుతున్నది. వెలుపల గంగకూడా సోహం శబ్ద గర్జనచేస్తున్నది. లోపల ప్రశాంతి! వెలుపల ఆనందం! ఈ చీకటిరాత్రి, నేను నా ప్రియుడైన భగవానుని సంగమించడానికి ఉద్దేశింపబడడంచేత సర్వ ప్రపంచాన్ని మలుపుచేసింది. అంటే బాహ్యాభ్యాంతరాలనుండి ప్రపంచాన్ని మూసివేసింది. ఈ అంధకారరాత్రియందు బాహ్యాభ్యంతరాలు సమానంగా ఉన్నాయి. ఎదురుగా అమృతవాహినులు ప్రవహిస్తున్నాయి. ఈ సమయంలో నేనా ప్రపంచ స్మృతి! ఎంత విచారకరం!

"అలెగ్జాండర్! నీ సామ్రాజ్యం ఎన్నాళ్లు నిలిచింది? ఎన్నాళ్లు నీవు జీవించావు? దేనికి నీవు డేరయన్‌ను చంపింది?"

"భూమికి స్వర్గానికి పోలిక లేదు."

కేంద్రస్థానంలో మాత్రమే కలయడం సాధ్యమని నా కుటుంబానికి చెప్పండి. అప్పటికి విడవడలేము.

"శాంతా రావసశీధ కాలముల భాస్వచ్చంద్ర శీతాతపా
కాంతిస్వచ్ఛమునున్న దీపులిన యోగ్యక్షోణి గూర్చుండి సు
స్వాంతోద్యోగులమైన మేము శివశబ్దావృత్తి నెప్పుడ
త్యంతానందభవాశ్రుసంకులదశా ప్రాప్తిసుఖంబుందుమో!"

—భర్తృహరి

అలాంటి ఆనందంకోసం చక్రవర్తులు సామ్రాజ్యాలు గడ్డిపూచలుగా పరిత్యజించారు. దేవతలు స్వర్గంవదలి గంగా

తీరాన్ని ఆశ్రయిస్తారు. అలాంటి ఆనందాన్ని వదలి, మిథ్యావస్తువుల వెంట పరుగెత్తడానికి, అదృష్టం నన్ను ఏకాకిగా వదలిందా ?

ప్రజలు తీర్థాలకు (పుణ్యస్థలాలు) పోతారు. తీర్థాలు జనులకడకుపోవు. సకల తీర్థ వ్యాపియైన తీర్థరామ పరమాత్మ పాదసన్నిధికి రమ్మని కుటుంబంతో చెప్పండి. అప్పుడుమాత్రమే వాండ్లు తీర్థరామ గోస్వామిని కలియగలరు. ఇంకోమార్గం లేదు. సత్సంగ గంగ నాగృహంలో ప్రవహించనంతవరకు, అక్కడి జాగ్రత్త నాకవసరంలేదు. అక్కడ ఒక్క నిముషం కూడా నిలువను.

సందేశాలుపంపి వచ్చినవాండ్లను జనులు తిరిగి యిండ్లకు తీసుకరాలేరు. నిజంగా తాముకూడా మృతినొంది తేనేగాని మృతులతో కలవలేరు. నేను జీవితంలో మృతి బొందాను. నా కుటుంబం నన్ను తిరిగిరమ్మని ఆహ్వానింప నవసరంలేదు నేను మరణించాను. వాండ్లు నామాదరి అయి నప్పుడు, నన్ను వాండ్లు కలియగలరు.

మురళీవాలా (రాముని జన్మగ్రామం) మురారివాలా (కృష్ణతీర్థము) అయినప్పుడు తీర్థాలంకారుడైన తీర్థరాముడు అక్కడికి వస్తాడు. సత్వగుణ గంగానది పారనిచోట నేనుండ లేను.

చివరకు ఎవరైనాసరే గంగలోకి శల్యాలరూపకంగా రావలసిందేకదా. భస్మము కాకముందే ఎందుకు తమ పచ్చ శల్యాలను జ్ఞానగంగలో వేయకూడదు ? లేదా ఇంకోరకంగా

జ్ఞానాగ్నిలో తమ శల్యసమిధలు దహింపవచ్చు. మజ్జను (అస్థిసారం) ఆజ్యంగాచేసి, జ్ఞానాగ్నిని ప్రజ్వలితం చేయవచ్చు. ప్రాణవాయువులో ఆ అగ్నిని విసరవచ్చు. ఆ విధంగా 'నరమేధం' చేయవచ్చు.

రాత్రి సమయంలో 24 గంటల్లో ఒక్క తడవమాత్రమే సాధుదర్శనానికి వెళ్లుతాను. వారానికి ఒక్కసారిమాత్రమే, సాధుసన్యాస సభలో ప్రసంగించవలసి ఉంటుంది.

ఐదారురోజుల క్రితం దాదాపు ఒకవందమంది మహాత్ములు భోజనంచేశారు. నాకు మహానందమైంది. సత్వగుణ మిక్కడ వ్యాప్తమైయున్నది. ఠాకూర్ ముకుందదాసుల నిద్దరినీ పంపివేశాను.

మీ ఆత్మ,
తీర్థారాముడు.

ఇంకో లేఖ చూడండి :

బ్రహ్మపురి తపోవనం, లక్ష్మణఝూలా ప్రాంతం
1898 అగస్టు 30

"పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ మదచ్యతే
పూర్ణ స్యపూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే"

" నేనొంటివాడను నే నొంటివాడ
భూసాగరములనే నద్వితీయుడను
నాకంటె వేరుగా నేదియులేదు,
పృథ్విని నేనే జలంబును నేనె !"

ఇప్పుడు నాదగ్గర ఒక్క విద్యార్థి కూడా లేడు. మనిషి పొలుకువలేదు. మానవచ్ఛాయకూడా లేదు. అరణ్యం! గాఢ నిశ్శబ్దత! ఆకాశంలో ఆరబోసినట్లు చుక్కలు. అర్ధరాత్రి సమయం. అయితే నేను ఏకాకినా?

లేదు, నేను ఒంటరిగా లేను! నా సేవకురాలు వాన జల్లువచ్చి నన్ను స్నానంచేయించింది. నా పరిచారకురాలు వాయువు సర్వత్రా సంచరిస్తున్నది. ఎవరా పరిచారకుడు? ఇప్పుడే నా పిలుపుకు "అయ్యా ఏమిటి?" అని పెద్దగా ప్రత్యుత్తరం వచ్చింది. పెద్దపులో, ఏ ఏనుగో అయివుంటుంది. వేనకు వేలు నా పరిచారక సమూహం యీ పొదరిండ్లలో బసచేసి యున్నారు ఇంకా అక్కడ ఒక్క చిన్న చిన్న గుహల్లో కొందరున్నారు. నే నెందుకు ఏకాకినౌతాను? ఎలా ఏకాకి నౌతాను?

కానీ, నే నేకాకినే! సేవకుడూ పరిచారకుడు లేడు. ఉన్నది నేనే! వృక్షాలుకాదు, నేనే. గాలికాదు నేనే! అది గంగ కాదు, నేనే. అది చంద్రబింబం కాదు, నేనే. భగవంతుడు కాదు, అతడు నేనే! ప్రియుడు కాదు, నేనే! ఐక్యతంటే ఏమిటి? నేనే అద్వితీయతను! ఓహో అద్భుతం! 'ఏకాకి' అనే మాటకూడా నన్ను ఏకాకిగా వదలి పారిపోయింది.

గర్జనల్ గర్జనలొనరించునవియు,
ఈ కొండలీచెట్లు ఈయరణ్యములు
రాత్రిం బవళ్లు ఈ చిత్రవర్గములు
ఈ స్నేహితుండును, ప్రియుడును మరియు,

సంయోగమును వియోగంబును, గాలి
నక్షత్రగణము, భాగీరథీజలము
మేఘంబు లుజ్వల చంద్రబింబంబు,
కలమును, కాగితంబును, నేత్రయుగము
వ్యాసముల్, నీవును, ప్రాణంబుకూడ
అన్నియు రాముడే, తెలుసుకోనన్ను."

నా చిరునామా అడుగుతారా? ఇదిగో:

"అగ్రాహ్యమైనది నా నివాసంబు
మీ హృదంతరమందె నా తావుగనుడు!
నా నేత్రములలోన జగము దాగినది,
ఎచటనో వెదకు నజ్ఞాని నన్నెపుడు!

రాముడీ విధంగా, సకల వ్యక్తిరేక వ్యామోహ తుపానులను ఎదుర్కొని, సమస్తవాసనలను సింహము కూలునువలె విదళించి, సాక్షాత్కారశిఖరం అధిరోహించాడు! ఆ పవిత్ర బ్రహ్మపురి కీకారణ్యగర్భాలలో రాముని ఆత్మానందతాండవ గీతం ప్రతిధ్వనించింది!

"ఈనాడు నేను తాండవమాడదలతు,
నటరాజతాండవం బొనరింతు నేను
సూర్యుడనై నేను తాండవించెదను,
నక్షత్రరూపాల నే తాండవింతు
చంద్రబింబంబునై తాండవించెదను
నటరాజ తాండవం బొనరింతు నేను!
అణువురూపంబుగా నే తాండవింతు

ఉత్తుంగసారంబై తాండవింతు
మేఘజాలంబులో తాండవించెదను
నటరాజ తాండవం బొనరింతు నేను !
ఈ దేహమున ప్రాణమై తాండవింతు
పరిశుద్ధరక్త నాళంబులై మరియు
చెడురక్తనాళంబులై తాండవింతు,
నటరాజ తాండవం బొనరింతు నేను !
వాయువునై నేను తాండవించెదను
ఘననదీనదములై తాండవించెదను
నటరాజతాండవం బొనరింతు నేను !
ప్రత్యనుక్షణము సంగీతరావములు
సకల సంగీతవాయిద్యముల్ చెలగ
నే తాండవించెద నిత్యమోహాహోహా !
నటరాజ తాండవం బొనరింతు నేను !
ఆనందమే నా నివాసగృహంబు
నా నివాసగృహ మానందమేను,
లయతాళ యుక్తతాండవ మేను సేతు;
నటరాజతాండవం బొనరింతు నేను !
ఘూర్ణిత మధువును * త్రప్పుదాగుచును
పడి లేచువాడనై తాండవించెదను !
నటరాజతాండవం బొనరింతు నేను !

... ... ... ... ... ... ... ... ... ओం !

* బ్రహ్మానందము

ఓం

# వానప్రస్థము—2

రాముడెప్పుడూ పర్వతశృంగాలకు అరణ్యసీమలకు ఎగిరి పోతుండేవాడు. ఎండకాలపు శెలవులన్నీ కాశ్మీరంలో, అమర నాథంలో గడిపాడు. తరచు హరిద్వార హృషీకేశాలకు నిర్గ మించేవాడు. తనకు చిక్కిన అవకాశమంతా సాంద్రమైన ఏకాంతగర్భాలలో గడిపేవాడు. మహారణ్యసీమలాయనకు, భగవంతునితో క్రీడించే రహస్యమందిరాలు. పర్వతశృంగాలా యనకు దైవ సన్నిధిలోని బంగారు పాదపీఠాలు. కొండవాగులు రామునకు భగవంతుని సంకీర్తనలో శృతిగల్పే సంగీత వాద్య విశేషాలు. ఆరణ్యక మృగవిహంగ సమూహాలు తోటి చెలి కాండ్రు. తన ప్రకృతిమయ స్వేచ్ఛాజీవనానికి తోడుపడనందున కొన్నిరోజులకు రాముడు, విశ్వవిద్యాలయ ఉపన్యాసక పదవికి రాజీనామా యిచ్చాడు. తరువాత దినానికి రెండు గంటలు మాత్రమే పనిచేయవలసిన ఓరియంటల్ కాలీజీలో రీడర్‌షిప్ ఉద్యోగం తీసుకున్నాడు. జీతం అతిస్వల్పమే అయినా, రాముడు ఆధ్యాత్మిక సంపదకు భంగంలేనిదని ఈ ఉద్యోగమును స్వీక రించాడు.

1900 లో, 'ఆలీఫ్' అనే ఒకమాస పత్రికను ప్రారంభిం చాడు. మూడు సంచికలు మాత్రం వెలువడ్డాయి. ఆ సంచిక ల్లోని రచనల్లో నాటి ఆయన అప్రతిమానజ్ఞాన యానం సంద ర్శింపవచ్చు.

ఒక మహాకారణం కోసరమై వచ్చిన రాముడింక, లౌకికజీవనంలో కొంచెం కూడా ఉండలేక పోయాడు.

1900 లో ఉద్యోగాదులను పూర్ణంగా వర్జించి వాన ప్రస్థయాత్రకు రాముడు పయనించాడు. హిమాలయశిఖరసీమలు రాముని ఆహ్వానించాయి.

భార్యాబిడ్డలతో, మిత్రుడైన స్వామి శివగుణాచార్యునితో తులారామ, నిఖేషా నారాయణస్వాములతో కలసి రాముడు వానప్రస్థయాత్రకు బయలుదేరాడు.

లాహోరు ప్రజలనేకులు, భజనలతో భగవన్నామ సంకీర్తనాదులతో గుంపులు గుంపులు స్టేషనువరకు రాముని అనుగమించారు. భక్తివైరాగ్యకాంతులు ఆ జనసంఘంలో తాండవించాయి. విద్యార్థులు, మిత్రులు, లాహోరు పౌరులు ప్లాట్ఫారమంతా క్రిక్కిరిశారు! బాష్పనేత్రాలతో రాముని వెంబడించారు. రాముని జీవితం, విశ్వకల్యాణానికై వ్రాయ బడిన ఒక మహావేదగీతమని, వాండ్లకేం తెలుసు? రాముని ఆ పరమ రహస్యసందేశం వాండ్లకేం తెలుసు! జనుల జయ జయకోలాహల ధ్వానాలమధ్య రాముడు సానుచరుడై రైలెక్కాడు. సిద్ధార్థుని నాటి నిశీథయాత్రాదీక్ష, రాముని విరాగవిగ్రహంలో జనులు సాక్షాత్కరించుకున్నారు! రైలు పోబోతున్నది! జనుల కోలాహల విజయరావాల మధ్య రామ రచితమైన ఒక మహాగీతాన్ని నారాయణు డిలా పాడాడు:

సెలవింక గణితశాస్త్రమ నాకు సెలవు
ఓ ప్రియరావీనదీ నాకు సెలవు.
ఓ గృహిణీ నాకు సెలవు వెళ్లెదను.
సెలవింక ఓ అమాయక బాలులార !
సెలవింక ఓ శత్రు మిత్రాదులార !
సెలవింక ఓ శీతవాతాతపంబ !
సెలవింక సుగుణ దుర్గుణ రాసులార !
సెలవింక హృదయమా ! ఓ దేవ ! సెలవు !
సెలవింక ఓ రామ ! సెలవింక సెలవు !

ఓం

# వానప్రస్థము—3

హరిద్వారం హిమాలయ సింహద్వారం. భారతీయుల కిది దివ్యప్రదేశం. హైందవతీర్థ యాత్రికులకు ఉత్తరాభిముఖంగా ఇక్కడనుంచి చూస్తే, జీవిత పరమాశయాన్ని చూపిస్తూ పాండుర హిమాలయ శృంగాలు గోచరిస్తాయి. ఈ హిమాలయ శిఖరమే శివావాసమని పౌరాణిక ప్రసిద్ధి – నిజం! నిజం! ఈ హిమాలయం శివావాసమే! ఈ హిమాలయ గుహాగర్భాలనుండే తపోమృత ప్రవాహాలు జగద్రంగంమీదికి వెల్లివిరిసాయి. ప్రశాంత గంగ అక్కడే అవతరించింది.

అందరూ హరిద్వారంనుండి దేవప్రయాగగుండా టెహ్రీ చేరుకున్నారు. ఆ ప్రాంతంలోని గంగాతీరారణ్యంలో ఒక ప్రశాంత రమణీయ ప్రదేశమును ఆశ్రయించారు. అది ఒక గంగాతీరంలోని సుందరోద్యానవనం. ఈ వనంలో మురళీధరుడనే వర్తకుడు తపస్వులకోసం ఒక విశాల రమణీయ సత్రాన్ని కట్టించాడు. రాముడు లిందు నివసింప నిశ్చయించారు.

మరునాడు రాముడు నారాయణుని పిలచి నీ దగ్గరఉన్న ధనమంతా గంగలో పారవేయమని ఆజ్ఞ యిచ్చాడు. అందరి డబ్బూ ఆయనవద్దే ఉంచారు పోయేది అడవులకు పరాయి స్థలమని అందరు జాగ్రత్తపడి తెచ్చుకున్న ధనాన్నంతా

గంగలో పారవేయవలసివచ్చింది. రాముడిలా అన్నాడు. "భగవంతునిమీద ఆధారపడిన మనకు ధనమక్కరలేదు. పూర్ణ శరణాగతితో మన భగవదిచ్ఛానుసారం జీవిద్దాము. వానిదయ మనమీద ప్రసరిస్తుంది. ఆ నిశ్చల విశ్వాసం లేదా చావవలసివస్తుంది. అవిశ్వాసంతో బ్రదకడంకంటే చావడమే మేలు." రామాజ్ఞను అందరూ శిరసావహించారు. నారాయణుడు డబ్బంతా గంగలో పారవేశాడు.

అందరినీ రాముడు గంగాతీరంలో వేరువేరు ఉచిత స్థానాల్లో కూర్చోబెట్టి అఖండ విశ్వాసంతో అహంగ్రహోపాసన (నేను దేహాన్ని కాదు, పరమాత్మను అనే భావనతో ధ్యానం) చేయమని ఆజ్ఞ యిచ్చాడు. ఆవిధంగా అందరూ ధ్యానమగ్నులై యున్నారు. ఇంతలో కొన్ని గంటలయేసరికీ, దైవచిత్రం, హృషీకేశపు కాలీకంబ్లీ క్షేత్రోద్యోగి బాబారామనాథుడు ఒక దుకాణాదారుతో అక్కడికి వచ్చాడు. మూర్తీభవించిన ఒక మహా విరాగజ్యోతివలె ఉన్న రాముని, ఆయన అనుచరులను చూడగానే బాబారామనాథుడు సమ్మోహితుడైనాడు. రామునికి నమస్కరించి అతడు, "మహారాజా! మీరిక్కడికి ఎప్పుడువచ్చారు?" "నిన్న" అని రాముడు మౌనముద్రాంకితుడైనాడు. కాసేపాగి బాబా మళ్లీ అడిగాడు– "మహారాజా; మీ ఆహారవిషయంలో ఏమియేర్పాటుచేయబడింది?" రాముడు పైకిచూస్తూ, "పరమాత్మా" అన్నాడు. భక్తివశుడైన రామనాథుడు యిలా మళ్లీ అన్నాడు. "మహారాజా! ఈ బన్వారిలాలనే మనిషి మార్గంలో ఒక దుకాణా

దారు. నెలకు పది రూపాయలకు సరిపోయే ధాన్యం ఇవ్వమని ఇతనితో చెబుతున్నాను. దయతో దీన్ని స్వీకరించవలసినది."

"నీకిష్టమయితే, యీవిషయం అదుగో దూరంగా కూర్చున్న ఆ బ్రహ్మచారికి (నారాయణునకు) చెప్పు" మని రాముడన్నాడు.

బాబా నారాయణతో ఇలా అన్నాడు "మహారాజా! మీ వర్గానికి నెల 1కి రు 10-0-0 లు ధాన్యం సహాయం చెయ్యమని యీ దుకాణాదారునితో చెప్పదలచాను. దయచేసి అనుమతించగోరుతాను. ఆహార విషయంలో ఇబ్బంది లేకుండ మీ ఉపాసన నిరభ్యంతరంగా సాగుతుంది."

అంతవరకు నారాయణుడు ఇతర్ల ధర్మంమీద జీవించడం ఎరుగడు. అలా తీసుకోవడానికి యిష్టపడక నారాయణు డీ విధంగా ప్రత్యుత్తరమిచ్చాడు. "కృతజ్ఞుణ్ణి. భగవంతు డిచ్చినది తప్ప ఇతరమైంది మేము తీసుకోము." రాము డప్పుడు నారాయణునితో యిలా అన్నాడు. "నారాయణా! భగవంతుడు అతని ద్వారా యీపని చేయిస్తున్నప్పుడు నీవు నిరాకరించవద్దు"- ఆ మాటలు విని బాబా, "మహారాజా! నిజంగా నేను చేస్తున్నది ఏమీ లేదు. నే నిక్కడికి ఈ యుద్దేశ్యంతో రాలేదు. ఊరక మిమ్ములను దర్శించాలని వచ్చాను. మీముఖారవింద దర్శనం నన్ను ముగ్ధపరచి నన్నీవిషయాలు అడుగజేసింది ఇదంతా దైవకృపే. నా దేమీ లేదు." అన్నాడు. అతని యేర్పాటు అందరూ ఒప్పుకున్నారు. సరిగ్గా 9 గంటల కల్లా, మామూలువంట సమయానికి అన్ని

పదార్థాలు అయాచితంగా తయారైనవి. ఇలా జరిగిన భగవత్స హాయంచేత, అందరి హృదయాల్లో భగవద్విశ్వాసం ద్విగుణీ కృతమై బలపడింది. మరింత మహోత్సాహంతో భగవధ్యాన నిమగ్నులైనారు. గాఢభక్తివశులై, అందరూ ఆనందవీచికలలో తేలాడసాగారు. నిస్సంగులై వారందరావనంలో ఋషి జీవితా లను గడపసాగారు. రాముని అపారవైరాగ్య పటిమ రెండవ హిమాలయమే !

ఒకనాడొక సంఘటన జరిగింది. అందరూ కూర్చుండి సంధ్యాసమయంలో నిర్మలంగా ధ్యానం చేసుకుంటున్నారు. పరమశాంతి రాజ్యమేలుతున్న సమయం. రాముని బంధు వొకడు బిగ్గరగ ఏడ్చుకుంటూ, రొమ్ములు బాదుకుంటూ అక్కడికి వచ్చాడు. ఎవ్వరూ కిక్కురుమనలేదు. గాఢానంద మయులై ఉన్నారు. ధ్యానానంతరం, ఆ యేడుస్తున్నవానిని రాముడు ప్రసన్న వాక్యాలతో ఓదార్చి విషయమేమిటని ప్రశ్నించాడు. ఇంటివద్ద రాముని కుమారుడొకడు చనిపోయిన వార్త చెప్పి ఏడవడం సాగించాడు. రాముడతనని ఓదార్చి, చిరునవ్వుతో ఇట్లు చెప్పాడు. "ఇదేమిటి ? గాలివీస్తున్నదని, చెట్లు పెరుగుతున్నవని, నదులు ప్రవహిస్తున్నవని ఏడవడంలో ఎంత అర్థంలేదో, నీవు ఆ బాలుని మృతికి ఆక్రందించడంలో కూడా అర్థంలేదు. ఇది ప్రకృతి సహజం. ఇందులో శోకింప వగిన విషయం రవ్వంతకూడా లేదు."

ఎంత అతీత దృష్టి! రాముడిట్లు సానుచరుడై కేవల బ్రహ్మధ్యాన నిష్ఠలో నిమగ్నుడైయున్నాడు.

ఒకనాటి అర్ధరాత్రి అందరు గాఢనిద్రలో ఉన్నారు. బ్రహ్మభావ పరవశోన్మత్తుడైన రాముడు, అందరినీ విడచి, ఒంటరియై ఉత్తరకాశీకి నిర్గమించాడు. బ్రహ్మాండమైన హిమాలయ నిబిడారణ్యం. మృత్యుభీకరమైన పర్వత సంకీర్ణమార్గం. మనిషి పోల్చుకువలేని నిశ్శబ్ద నిశీధి. ఆకాశంలో మేఘాలు క్రమ్మినవి. ఉరుములు, మెఱుపులు, కుంభవృష్టి కురియ సాగింది. ఆ దుస్సహ భయంకర నిశీథంలో, రాముడు ఏకైక పరిధానుడై పోసాగాడు. పైన గుడ్డ లేదు. గొడుగు లేదు. చెప్పులు లేవు. కేవలం అవధూత! సుళ్ళుతిరిగే కొండవాగుల నతిక్రమించి, నిట్టనిడువు పర్వతపు చెరియలను ప్రాకి, అగాధపు లోయలను అతిక్రమించి, ఆ చీకటిలో కొండమేకలు సైతం ఎక్కలేనిగాని ఒక మహాగిరి శృంగాన్ని రాముడు అధిరోహించి, బ్రహ్మానందోన్మత్తుడై ఓం ఓం అని ఓంకారోచ్చారణ చేయ సాగాడు. సమస్త విశ్వైక్యత పొందిన ఆ మహాపురుషుని ఏ అపాయం స్పృశిస్తుంది! ఆ మహనీయుని ఆజ్ఞ లేనిది మృత్యువుకూడా దూరంగా నిల్చోవలసిందే!

ఆ పర్వతశృంగంపై రాముడు "శివోహం, శివోహం" అని గర్జనచేయసాగాడు. ఆ నిబిడ నిర్జన వినీల సాంద్ర హిమారణ్యం ఆయనకు వేరుగా కనబడలేదు. సమస్త విశ్వాన్ని తన మహాలింగనంలో పునీతం చేయవలసిన మహాదక్షత, రామునిలో మనం సాక్షాత్కరించుకోగలం. శుకుని మహావిశ్వైక్య పారవశ్యం, యుగయుగాల నతిక్రమించి నేడు కనపడింది!

రాముడీ విధంగా ఆకస్మికంగా అదృశ్యుడవడంచేత రామ సతీమణి గుండెపగిలింది ఆమె విచారవివశయై రోగగ్రస్థయైంది కొన్నాళ్లయిన తరువాత రాముడు ఉత్తరకాశీనుండి తిరిగి వచ్చాడు. కానీ ఆమె ఆరోగ్యం కుదుటపడలేదు. ఆమె స్థితి అపాయకరంగా మారింది. రామాజ్ఞానుసారం నారాయణుడామెను చివరకు మురళీవాలాకు చేర్చివచ్చాడు. చేతులలో చిన్నకుమారుడైన బ్రహ్మానందునితో, ఆ పతివ్రతామణి పరమ దరణ్యాలనుండి ఇంటికి వెళ్ళింది.

యుగపురుష మహాప్రస్థానయాత్రేమో యిది! రక్త బాంధవ్య వైతరిణీనదిని అతిక్రమించిన నిసుంకదా ముక్తపురుషులు! ప్రతి వ్యక్తిజారి చేతకల బడదగిన విషమ స్థితుల్లో, ధర్మవీరులు ఎంత వజ్రకఠోరులు! ఎన్ని గుండెలు పగిలినా, ధర్మమును, ఆదర్శాన్ని పగలగొట్టరుగదా మహాపురుషులు!

ఓం

ఓం

# సన్యాసము

భారతీయ జీవిత చరమశిఖరం సన్యాసం. రాముడట్లు ఆరుమాసాలు ఏకాంతవాసం చేశాడు. ఆయన నరనర లోని ప్రతి అణువులో సర్వసంగపరిత్యాగాగ్ని సహస్రజ్వాలా ముఖాలతో ప్రజ్వలించింది. రాముడింక సన్యాస స్వీకారం చేయదలచాడు. ఆయనలోని ఆంతర్విరాగం బాహ్యకంగా కూడ ప్రకాశింప దలచింది. 1901 లో, శ్రీ వివేకానందస్వాములవారు కొద్ది రోజులకు ఇంక శరీర పరిత్యాగం చేస్తారనంగా రాముడు సన్యాస స్వీకారం చేయదలచాడు. రాముడిదివరకే మహా సన్యాసి. దానిని సగుణరూపంలో ప్రదర్శించడమే చేయదగిన పని. ఒక శుభదినంనాడు మంగలాకడు పిలువబడ్డాడు. రాముడు ముండితశిరస్కుడైనాడు. నారాయణ తులారాములు కాషాయ వస్త్రాలు తయారుచేశారు. రాముడంతట, పవిత్ర గంగా మధ్యములో యజ్ఞోపవీతమును పరిత్యజించాడు. ఓంకారోచ్చారణతో కాషాయాంబరాలు ధరించాడు. గంగానదీ తీరంలో రాముడంత గాఢధ్యాన నిమగ్నుడైనాడు. దైవికంగా ఉత్తర కాశీ నుంచి వచ్చిన కొందరు సాధువులకు సమారాధన జరుపబడింది.

రాముడిట్లు విద్వత్ సన్యాస స్వీకారంచేశాడు. శంకరుని వలె మహాసన్యాసి అయినాడు. సిద్ధార్థునివలె మహాభిక్షుకుడై

నాడు. ప్రవృత్తినామమైన తీర్థారామనామం, నివృత్తిరూపక మైన శ్రీరామతీర్థగా మారింది. ఓహో! శ్రీ రామతీర్థుల కాషాయవస్త్రారుణతేజం, సుప్తభారతలోకానికి శుభోదయ సూర్యతేజం!

స్వేచ్ఛావిహంగం మాదిరి రామతీర్థస్వామి విజనారణ్యా గర్భాలలోకి ఎగిరిపోయి, నిరంతరధ్యానంలో తన్మయత్వంలో ఈదులాడసాగాడు. అర్థరాత్రి సమయాలలో ధ్యానంనుంచి లేచి, ఆ నిబిడాంధకారబంధురాలైన కీకారణ్యపథాల్లో, భగవన్మధు పాన మత్తతచేత తడబడే అడుగులతో అర్థ నిమీలిత నేత్రా లతో, మృత్యువును ఎదురించడానికి లాగా ఎక్కడికో నిర్గమిం చేవాడు. తనలో సమస్త విశ్వమును సమస్త విశ్వంలో తనను దర్శించిన, రామపరమహంస కేమి భయం?

ఒకసారి అయిదు ఎలుగుబంట్లు రాముని కెదురైనాయి. రాముని బ్రహ్మతేజమును చూడలేక అవి పరుగెత్తాయి. ఇంకొకసారి ఒక పెద్దపులి ఘోకరఘూడించి పరుగెత్తింది. భయం కర క్రూరమృగాలలో రామపరమహంస తన ఆత్మనే దర్శిం చాడు. తన అంతఃపురాలలోకి వెళ్ళే మహారాజువలె, రామ పరమహంస, చొరరాని వనగుహాగర్భాలలో స్వేచ్ఛామయుడై విహరించేవాడు.

1901 ఆగస్టు 15 న నారాయణతులా రాములతో రామ తీర్థస్వామి యమునోత్రి, గంగోత్రి, త్రియుగి నారాయణము, కేదారనాథం, బదరీనారాయణాదులను సందర్శించాడు. ఆయనకీ హిమాలయవనగర్భాలు క్రీడారంగాలు. ఒక కోకిల, ఒక చూత

1902 ఫిబ్రవరిలో రాముడు సాధారణధర్మసభా ద్వితీయ వార్షికోత్సవానికి ఫిజాబాదులో అధ్యక్షత వహించాడు. సర్వమతవక్తలకొక సాధారణరంగము ఆ మహాసభ. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, తదితరమతస్థులందులో పాల్గొన్నారు మొదటి సమావేశంలో, రాముడు ఆత్మనుగూర్చి నారాయణుని ఉపన్యసింపకోరాడు. ఉపన్యాసానంతరం, మౌల్వీ మహమ్మద్ ముర్తాజాఖాన్ అనే మహమ్మదీయపండితుడు కొన్ని వ్యతిరేకవాదనలకు దిగాడు. అతని ఆక్షేపణకు, సావధానంగా రేపు ప్రత్యుత్తరమిస్తానని రాముడు చెప్పాడు మరునాడు మౌల్వీ బాగా సంసిద్ధుడై వచ్చాడు. వాదనకు కాదు, పోరాటానికి. రాముని కెదురుగా, ముఖాముఖిగా అతడు కూర్చున్నాడు. రాముని చూపులు, అతని చూపులు కలుసుకున్నాయి. విచిత్రం! మౌల్వీ తన ఆక్షేపణాలన్నీ మరిచిపోయినాడు. అతని నేత్రాలవెంబడి ప్రేమాశ్రువులు జలజలరాలుతున్నవి. చేతులు ముకుళించి రామునితో ఇలా అన్నాడు: "ప్రభూ! మన్నించు. నిన్న నేను తెలుసుకోలేక పోయాను. నన్ను క్షమించు." అనాటినుండి ఆ మౌల్వీ ఉత్తమభక్తుడైనాడు.

విశ్వప్రేమసాగరమైన రామపరమహంసలో, ఈ ఉద్రేకవిఘూర్ణమానవాహిని కలసి, విలీనమై, పునీతమైంది! బుద్ధదేవునిపైకి వచ్చిన అంగుళిమాలుని కథలాగా లేదా ఇది?

రాముడు సర్వైక్యానుభవుడు. అఖిలవిశ్వం ఆయన శరీరమే. ఇట్టి బ్రహ్మస్థితిని అధిగమించిన ఆ మహాపురుషునికి వ్యతిరేకం ఉంటుందా? ఆ ప్రేమలో అందరూ విలీనం కావలసిందే.

రామపరమహంస, ఈవిధంగా, తన ధర్మచక్ర పరిభ్రమణాన్ని సాగించి తిరిగి ఏకాంత హిమసీమలకు నిర్గమించాడు. లోకములో ఒక మెఱుపు మెఱిసినట్లయింది. జగత్సంగ్రామరంగంలో, విషయ విభ్రాంతులనే శరపరంపర తాకిడికి వెన్నిచ్చి పరాభూతులై పారిపోతున్న మానవలోకానికి, మహాధర్మ యోధ శిఖామణియైన రామతీర్థుని విజయసందేశ పాంచజన్య మహారవం అభయప్రదానం చేసింది! ఈ వేదాంత శంఖారవళికి ఆ విద్యావరణదిశలు ఘూర్ణిల్లాయి!

ఓం

ఓం

# పరివ్రజనం

## [ జపానులో ]

1893లో చికాగో నగరంలో, చరిత్ర అతిప్రముఖ స్థానమలంకరించిన మతమహాసభ జరిగిన విషయం మనకు తెలుసు, శ్రీవివేకానందస్వామి, శ్రీ అనాగరిక ధర్మపాల మహాశయుడు, కంజవానోజన్ షిరో నాగుచ్చి (Zenshiro Noguchi) మొదలైన ప్రముఖ మతప్రతినిధులతో చికాగో మతమహాసభ ప్రదీపించింది. తిరిగి అలాంటి సర్వమతమహాసభను ఏర్పరచే అవకాశం లభించలేదు.

జపాన్ దేశీయుడైన ఒక కూరా మహాశయుని వంగదేశ మిత్రులు కొందరు తిరిగి అలాంటి అంతర్జాతీయ మతమహాసభ ఒకటి టోకియోలో జరుగనున్నదనే వదంతి ప్రచారం చేశారు. ఇది ఎలా జరిగిందంటే, ఒకకూరా మహాశయుడు 1902 లో ఇండియాలో ఉన్నాడు. ఆయన సోదరి నివేదితతో, టోకియోలో సర్వమతమహాసభ నేర్పరచాలని ఒక ఉద్దేశ్యాన్ని వెలువరించాడు. భారతదేశ వార్తాపత్రికలు ఈ విషయం విని ప్రకటించాయి. ఒకకూరా కలకత్తాలో ఉండగానే యీ వార్త జపానుకు తెలిసింది. అక్కడ పత్రికలు ప్రకటించాయి. ఈ వార్త యీరకంగా ప్రాకింది.

ఆ రోజుల్లో రామతీర్థస్వామి టెహ్రీగఢ్వాల్ ప్రాంతారణ్యంలో ఉన్నాడు దివారాత్రాలు అఖండధ్యానంలో గడుపుతున్నాడు అఖండజ్ఞానానంద తన్మయుడై రాముడున్నాడు. స్వామి ఆ రోజుల్లోనే తన గీతాలన్నీ చాలవరకు రచించాడు. అందులో ముఖ్యగీతం ఆయన మధుర జీవితగీతమే.

ఎప్పుడో ఆయన నోరు కొంచెం విప్పుతాడు. ఆయనను సందర్శించిన వ్యక్తులందరికి, ఆయనలోని దైవసుగంధం ఆఘ్రాణించే భాగ్యం లభ్యంగది. బ్రహ్మానందోన్మత్తత చేత ఆయన నేత్రాలు మిలమిలమెరిసేవి. ఆయన ముఖారవిందం ఒకమహోన్నతాతీత తన్మయత్వ మహాతేజం ప్రకాశించుతున్నది. కాలి క్రింద గడ్డిపోచను సైతం పరాయణ మహావిభుడై స్పృశించేవాడు. గంగానదిని "నా గంగ" అని పిలిచేవాడు. చివరకు కాగితాలకు, కలాలకు, పెన్సిళ్ళకు కూడా స్వంత పేర్లు పెట్టి పిలుచుకునేవాడు. ఏదో స్వనిర్మిత చైతన్యలోకంలో రామతీర్థభగవానుడు జీవిస్తుండేవాడు.

ఎప్పుడు ఆనందం రామునిలో తరంగితమై ఉంటుంది. ఒక అడవిమృగంలాగా పర్వతశృంగాలకు అధిరోహించేవాడు. హిమాలయ గుహాలలోకి పరుగెత్తేవాడు. నదీతరంగాలలో ఈదులాడేవాడు. నిశీథ సమయాల్లో వనమార్గాలలో విహరించేవాడు. ఇదంతా రామునికి విలాసవ్యాయామం. ఆయన దర్శనార్థం వెళ్లినవారికి, రాముడు నిరంతరం ఏదో ఒకమహా పారవశ్యనిమగ్నుడై యున్నట్లు కనబడేది. అనేకసార్లు రాముడు, రోజులకు రోజులే ఏ నిగూఢ గుహల్లోనో శయనించి, అన్నపానీ

యాదులు కూడ లేకుండా; తన్మయస్థితిలో ఉండడం అనేకులు దర్శించారు.

ఆయన గంగానదీ తీరంలో కూర్చుండేవాడు. పరవశ బాష్పప్రవాహాలు ఆయన నేత్రాంచలాలగుండా స్రవించి పోతుండేవి

జనులు ఆయన దర్శనార్థము వేచివలసిందే. ఆయన మాత్రం జనమధ్యంలోకి రాడు. శ్రీ ప్రసాద మహారాజు స్వామి యందు కడు భక్తిగల శిష్యుడు. రాముని ఆ దివ్యతన్మయస్మిత కాంతులలో, మహారాజు మునుగుతుండేవాడు. లోకాలోకనను వదలిన పిదప స్వామి చేసిన మూడు సంవత్సరాల హిమాలయ నివాసం, నగ్నప్రకృతిపూర్ణదర్శనమయమైన గడుపబడింది. రామునికీ, ప్రకృతికి ఏర్పడిన ప్రణయం, ఏకత్వం అద్వితీయం. పంచభూతాలు ఆయన మిత్రులుగా, సమస్త ప్రకృతి ఆయన అవయవాలుగా మారాయి. ఆయన కదిలితే జగతి కదలడమే నట.

"ఇదంతా నా శరీరమే. నదులు నా రక్తనాళాలు. పర్వతాలు ఎముకలు. అవసరమైన శరీరభాగం మొండిచే నా చేయి అప్రయత్నముగా పోదేమోగదు, నా హృదయ అవసరాలు తీర్చడానికి ప్రకృతి సహాయం వస్తుంది. హిమాలయాల శిఖరాలపైని మంచుతుఫాను యితరులకు మృత్యుప్రాయమవచ్చు. నాకది నేను మృదువుగా నడవడానికి పరువబడిన అతిసున్నితమైన తెల్లని శిల్కుతివాచీయే. చెప్పులు తొడుక్కొని, రాళ్ళపై నడవడం నాకు ఇష్టంలేదు. నాకూ, వాటికీగల బాంధవ్యాన్ని,

ఏకత్వాన్ని పరస్పరం అర్థంచేసుకోవలసియున్నది. తనలో ఉన్న అహంకృతిని పోగొట్టుకున్నట్లయితే, దానిని గంగలో ప్రక్షాళనం చేసుకున్నట్లైతే మానవుడు భగవంతుడే. దివ్యాద్వైత వాహిని ఎవనిలో ప్రవహిస్తుంటుందో ఆ మానవుడు భగవంతుడే. నేను శివుడను. మలబారు, కారమండల్ నా రెండు పాదాలు. రాజపుత్ర స్థానపు ఎడారులు నావక్షస్థలం. వింధ్యాచలాలు నాకటిమండల మేఖల. దిక్కులకు నా బాహువులను చాచుచున్నాను. హిమాలయాలు నా శిరస్సు. నాజటామండలంలోనే గంగ ఆవిర్భవించింది. నేను భారత వర్షాన్ని. పశుపక్షినరస్సృగాదులు నేనే! అంహం బ్రహ్మాస్మి!" ఇదీ రాముని వాఙ్మయం!

స్వామి జగత్తుకివ్వాలసిన ఒక మహా సందేశమున్నది. ఆయన సమకూర్చుకున్న అమృతకలశాన్ని విశ్వానికి పంచి పెట్టాలసిఉన్నది. ఆ సమయం ఆసన్నమయింది. ఆయనలో నుంచి ఉద్గతమైన శాంతిమందాకిని, జగద్రంగంమీదికి వెల్లువికి ప్రవహింపదగిన శుభావకాశం వచ్చింది.

వేదాంతజ్యోతి శ్రీరామతీర్థస్వామి. ఆకులపై, కొండలలో, నదీతరంగాలపై, మలయానిలంలో పూవులలో, తారలలో, మేఘములలో, ప్రకృతి గ్రంథంలోని ప్రతిపుటలో వ్రాయబడిన భగవత్సందేశాలను అర్థంచేసుకొని, లోకానికి రామమహర్షి ఒక మహా వ్యాఖ్యానం చేశాడు. ఆ వ్యాఖ్యానాన్నే రాముడు అనుష్ఠాన వేదాంతమని పేర్కొన్నాడు.

ఆయన వేదాంతంలో సర్వమత వాహినులు సంగమించి పునీత రూపం దాల్చాయి.

టెహ్రీమహారాజా కీర్తిషాడు స్వామి సన్నిధికి వచ్చి టోకియోలో ఒక ప్రపంచమతమహాసభ జరుగబోతున్నదనే వార్తను నివేదించి, హిందూమత ప్రతినిధిగా స్వామిని వెళ్ళవలసినదిగా ప్రార్థించాడు. వెంటనే బయలుదేరినట్లయితే సకాలంలో చేర వచ్చునని స్వామిని మహారాజా ప్రార్థించాడు. స్వామి ప్రయాణ సన్నద్ధుడై ఒక వారంలోగా జపానునౌకను అధిరోహించాడు.

1909 ఆగస్టు 28 వ తేదీ రామ నారాయణస్వాము లిరువురూ జపానుకు ప్రయాణమైనారు. హాంకాంగువరకూ జార్డుకంపెనీవారి నావలో పయనించారు. హాంకాంగులో ఆ సన్యాసు లిరువురూ వాస్యామల్ అస్సోమల్ అనే హిందూ వ్యాపారస్థుని అతిథులుగా ఒక వారం ఉన్నారు. దారిలో ప్రతి చోటులా వారు దర్శించారు వారు దిగిన చోటులలో సిక్కులు, సింధు వ్యాపారులు అతిప్రేమతో ఆహ్వానించారు. హాంకాంగులో సిక్కు గురుద్వారంలో రామపరమహంస గురుభక్తిని గూర్చి ఉపన్యసించాడు. ఆ మహామృత సందేశశ్రవణానికై ఎక్కడెక్కడనుంచో జనులువచ్చారు. స్వామి దివ్యహృదయానికి ఆకర్షితులై హాంకాంగులో అక్కడివారు కొందరు వారిని ఒకవారందాకా పోనివ్వలేదు. హాంకాంగునుంచి ఒక అమెరికానావ వారిని 10, 12 దినాలకు యోకహామా చేర్చింది.

నారాయణస్వామి వచ్చియున్నాడు. వారిరువురుని గురించి నాకేమీ తెలియకపోయినా, ఇంచుమించు నాకు ఏదో మహానందావేశంలా నాకు పిచ్చెక్కింది. వారి భాషకూడా నాకు విచిత్రంగా ఉన్నది. వారి పాలకములలో దివ్యత్వం నిండి ఉన్నది. ఆ మహాతేజం నన్ను నిస్తబ్ధులనుచేసి మోకరిల్ల చేసింది.

రెండో స్వామి నన్నడిగాడు— "ఏ దేశం మీది" అని. అశ్రుపూర్ణ నేత్రాలతో హృదయ ప్రేమభావంతో "ఈ విశాల ప్రపంచమే నా దేశ"మన్నాను. పెద్దస్వామి (రాముడు) నాకండ్లలోకి చూచి "మంచి చేయడమే నా మత"మన్నాడు

ఈ రెండు వాక్యాలతో మేము పరస్పరైక్యత పొందాము.

ఆనాడు బౌద్ధ విశ్వవిద్యాలయంలో ఒక మహాజన సభలో నేను ఉపన్యాసం చేయవలసి వచ్చింది. ఆ సభలో ఉపన్యసింపవలసినదని స్వాముని నేను ఆహ్వానించాను. స్వామి అనుమతించాడు. అందరము ట్రాం కారు ఎక్కాము. మూసిన అద్దపు కిటికీలమీద వ్రాలి, నేనక్కడ ఉండగనే మైమరచి, నా హృదయ వీణలో మేళవించి మధుర ఓంకారస్మరణ చేశాను. ఉపన్యాసానికి నేనేమి సిద్ధంచేయలేదు. [illegible]ళ్ళను. లేచి నిలుచున్నాను. ఉపన్యాసం సభికులను పరవశులను చేసింది. స్వామి రాముని నేను సభకంత పరిచయం చేశాను. అప్పుడు అగ్ని కణాలను వెదజల్లిన రీతి స్వామి ఉపన్యసించాడు. ఆ సభలో బౌద్ధులున్నారు, ఆస్ట్రేలియానుంచి వచ్చిన థియాసఫిస్టు (దివ్యజ్ఞాన సమాజికులు) ఉన్నారు. వారందరూ స్వామి

సందేశం విన్నారు. ఆ వేదికమీదనే కాంజో మహాశయుడు, జపాన్ దేశపు కార్లయిల్ ఉచిమురా ప్రసంగించారు.

మేము తిరిగి వచ్చేసరికి బాగా సాయంకాలమయింది. స్వామి నాతో ఇలా అన్నాడు: "నీలాంటి వ్యక్తినే నేను కోరుతున్నాను. ఈ టోకియో జనసంకుల వీధులలోనే, మహా రభసతో ఉన్న గాంజాస్ట్రీటులో పోతూనే, చలించని మనః ప్రశాంతితో అభ్యాసం తయారుచేశావు. ఈ విశ్రాంతే జీవితరహస్యం. ఇదే మానసిక ఏకాగ్రత. ధ్యానం – ఇదే సక్రమ మానం. ఇందులోనుంచే మహాశయాలన్నీ వెలువడు తాయి. మానవాభ్యుదయ స్వప్నాలన్నీ ఇక్కడే కనేది. ఈ తన్మయరాజ్యంలోనే మానవమనస్సులో సమస్త ప్రేరణా విద్యుద్రేఖలన్నీ మెరిసేది. సంపూర్ణ మానసిక శాంతిలో సహజ దేహ విశ్రాంతి తీసుకొనే విషయమిదే. ఇదే వేదాంతయోగం. ఇది మహావిషయం." నే నొక్కమాట వినలేదు. కారణం తాను కలలుకన్న ప్రియునితో ప్రథమసమాగమం పొందిన సుందరివలె నేను ఆనందంలో వొళ్లుమరిచాను. ప్రకంపించి పోయాను. ఆయన వాక్యాలు వినే ఓపిక ఉందా? అప్పుడు అటూ యిటూ పరిగెత్తేవాడిని. ఏదో అర్థంలేకుండా వారి గదిలో కాలుసలుపక వెలుపలికి పరిగెత్తేవాడిని. మళ్లీ పిచ్చి ఎత్తినట్లు లోపలికి వచ్చేవాడిని. ఆయన దగ్గర ఎక్కువసేపు ఉండలేక పోయేవాడిని. మళ్లీ బైటా నిలువలేను. నేనాయనను ప్రేమించాను. ఆయనంటే నాకతిప్రీతి. నేను గనుక కన్యనై

యుంటే ఆయనను కైవసం చేసుకోవడానికి నాసర్వస్వం త్యాగం చేసేస్తాను. అయితే ఒకటిమాత్రం సత్యం.

ఆయన చెప్పినదేమిటో నేను ఒక్క మాట కూడా విన లేదు. అయినా ఆయన నోట్లోనుంచివచ్చిన ప్రతిమాటా, నామనస్సులో హత్తుకున్నవి. అది గాక నానోట్లోనుంచి వచ్చే వాక్యాలు సరిగా ఆవాక్యాలే.

*　　　*　　　*　　　*

మరునాడు నేను, 1893 సర్వమతమహాసభావిషయక మైన పత్రాలుగల రెండు పెద్దపెద్ద సంపుటాలు తెచ్చి స్వామి టేబిలుమీద ఉంచాను.

"ఓహో! సరిగ్గా రాముడికి కావలసింది ఈ పుస్తకమే. ఇది నీకెట్లా దొరికింది? రాముడికేది కావాలన్నా, దాన్నల్లా ప్రకృతి స్వయంగా తెచ్చియిస్తుంది"

టోకియోలో పెట్టనున్న సర్వమత మహాసభనుగూర్చి మేము చాలాసేపు మాట్లాడాము ఆ సభ లేదని తెలిసినపిదప, స్వామి పకపకా నవ్వి ఇలా అన్నారు:— "ఎలాంటి చిత్రమైన ఉపాయం పన్ని ప్రకృతి రాముణ్ణి తన ఏకాంత హిమాలయా రణ్యాల నుంచి వెలికి తెచ్చింది! లేశమాత్రమైన అసత్యవార్త కూడా ఎంత బలీయమైంది. రాముడే సర్వమత మహాసభ అయిఉన్నాడు! టోకియోలో అట్టి సభ లేకపోతే, ఫోనీ రాముడొకటి ఏర్పాటు చేస్తాడు."

నిజంగా రామతీర్థస్వామి ఒక విశ్వమత మహాసభే! పరస్పర కలహ వికలితములైన వివిధ మతములు, రామసందేశ

లాలనచే శాంతి పొందగలవు ! భగవత్ప్రేరితమైన రామ పరివ్రజనమిందుకే.

• "ప్రతి సాయంత్రం స్వామిచుట్టూ జనసమూహం కూడేవారు. వారి దివ్యప్రసంగాలు భారతీయులు, జపానీయులు అత్యంత శ్రద్ధతో ఆలకించారు. నేను కండ్లుమూసుకొని, ఒక మూలన తీవ్ర పారవశ్యంతో ఓంకార స్మరణ చేసుకుంటూ ఒక నైపు ఏమీ వినకుండానే, అన్నీ వింటూ కూర్చుండేవాడిని"

"టోకియోలో, స్వామి * విజయరహస్యం" అనే గంభీరోపన్యాసము నిచ్చారు. ఆ మహోద్భుతోపన్యాసం విని, సభికులందరు ప్రముగ్ధులైనారు. ఉపన్యాసానంతరం ఇంగ్లీషు రాకపోయినా, ఇదంతా వింటున్న ఒక కళావేత్త "స్వామి నాకు చూడ్డానికి ఒక అగ్ని ప్రవాహంలాగా ఉన్నాడు. ఆయన వాక్యాలు ఆ మహాగ్నిలోనుంచి ఎగురుతున్న జీవితాగ్ని కణాల్లాగా ఉన్నవి." అన్నాడు.

ఒకనాడు పూర్ణసింగు స్వామిని టోకియోలో 'బారన్ నాయిబో కాండో' గృహానికి తీసుక వెళ్లాడు. ప్రసంగ మధ్యంలో కాండో లేచి లోపలికిపోయి, తన భార్యాపిల్లలను తీసుక వచ్చి క్షమాపణ పూర్వకంగా ఇలా అన్నాడు: "నన్ను క్షమించాలె ఈ "సామాన్యదుర్లభానందాన్ని నాభార్యాపిల్లలకు పంచకుండా నేనొక్కడనే అనుభవించ లేను."

* ఆశ్రమ ప్రకటితమైన "శ్రీరామతీర్థ సంపూర్ణ వేదాంత సారస్వతపు ద్వితీయ సంపుటం"లో ఈ ఉపన్యాసం ఉంది.

తరువాత నాయిబోకాండా స్వామిని "మీకుటుంబమును ఎందుకు పరిత్యజించారు?" అని అడిగాడు. "ఇంకా పెద్దకుటుంబాన్ని సంపాదించడానికి, సర్వప్రపంచంతో నా ఆనందం పంచుకోడానికి"—అని స్వామి ప్రత్యుత్తరమిచ్చాడు.

ఎట్టి విశాలసన్న్యాసం! ఈ గంభీరవాక్యాలలో బుద్ధుని విశాలవాణి వినబడడంలేదా? ఆ రాత్రి పోతూ, నిద్రపోతున్న కుమారరాహులుని చూచి బుద్ధుడంటాడు: "రాహులా! నేను నిర్దయతో పోతున్నానని అనుకోవచ్చు నీవు. కానీ నేను నీకేగాక యావజ్జగతికి తండ్రిని గాపోతున్నాను." ఇది సత్య సన్న్యాస హృదయం!

రామతీర్థస్వామి జపాన్ దేశంలో తన వేదాంత సందేశ చంద్రికలను వెదజల్లాడు. జపాన్ దేశీయులు తామారాధిస్తున్న ఆశియాఖండ జ్యోతియైన బుద్ధభగవానుని శ్రీరామతీర్థస్వామిలో సందర్శించి, తమ ఆలయాలలో ఆ మహామునిముందు హారతులు వెలిగించారు.

టోకియోలో రాముడు పదిహేనుదినాలున్నాడు.

అమెరికాకు పోవడానికి ఒకరోజు ముందు రామస్వామి నారాయణుని పిలచి ఇలాఅన్నాడు. 'మన యిద్దరమూ కలసి ఒకేచోట ధర్మప్రచారానికి పోవడం అపాయకరం. భగవంతుని మీద ఆధారపడడానికి బదులు మనం ఒకళ్ళమీద ఒకళ్ళం ఆధారపడతాము. మనం విడిగా పయనిస్తే వేదాంత సందేశమును ఇంకా ఎక్కువగా ప్రచారం చేయవచ్చు. రాముడు అమెరికాకు వెళ్తాడు. నీవు బర్మా, సిలోన్, ఆఫ్రికా,

యూరప్ ఖండాలకు, భారతవర్ష సన్దేశాన్ని తీసుకపో. ఈ యీా దేశాలలో వేదాన్తజ్యోతిని వెలిగించు. నేనురమ్మన్న వరకూ భారతదేశానికి తిరిగి రావద్దు" నారాయణస్వామి గురుర్వాజ్ఞను శిరసావహించాడు! చేతిలో ఒక్క రాగికానీ లేకుండా, కేవల ఆత్మవిశ్వాసభావ్యులై ఈ మహాసన్యాసులు, ప్రపంచ సంచారం చేశారు. విశ్వైక్య హృదయులైనవారికి, సమస్త విశ్వం ముగ్ధప్రేమతో సేవచేసింది!

చికాగో మతమహాసభకు బౌద్ధమత ప్రతినిధిగా వచ్చిన కె. హిరాయ్ మహాశయుడు స్వామినిగూర్చి వారు జపానువిడి చిన పిదప ఇట్లన్నాడు: "పూలలాగా గాలిలో తేలిపోతున్న ఆయన మందహాసాలు ఇప్పటికీ నాకు కనబడుతున్నవి"

ప్రొఫెసర్ తాకకుత్స మహాశయుడు, "నేను అనేకమంది హిందూమహాత్ములను, సాధుపురుషులను కలిశాను. కానీ శ్రీరామతీర్థస్వామికంటే మించిన వేదాంతావతారమూర్తిని దర్శించలేదు." అన్నాడు.

శ్రీరామతీర్థభగవానుడిట్లు, తన మహోన్నత వేదాంత సందేశపు వెలుగులలో, జపాన్ ప్రజానీకానికి శాంతిపథాన్ని చూపి అమెరికాకు పయనించాడు.

తమకు ఆ మహా నిర్వాణ పథాన్ని చూపిన శ్రీరామతీర్థ భగవానుని ముఖారవిందాన్ని, జపానీయులు తమ ఫ్యూజి యామా హిమశిఖరంగా గుర్తుంచుకున్నారు.

౨౦

# పరివ్రజనం–2

[ అమెరికాలో ]

నౌవ అమెరికా హార్బరుచేరింది. ప్రయాణీకులందరూ హడావిడిలో దిగుతున్నారు. కాని స్వామి మందహాస ముఖ పద్మంతో దివ్యానంద పారవశ్యతలో, ప్రశాంతుడై యున్నాడు. ఏదో ఒక మహాగంభీరసముద్రంవలె యున్న రామతీర్థ పరమ హంసలను చూచిన ఒక అమెరికన్ ఆశ్చర్యపడుతూ ఇలా అడిగాడు.

"మీ సామానెక్కడ ?"

"నేను తప్ప నాకేసామానూ లేదు"

"మీరు డబ్బు ఎక్కడ దాచుకుంటారు? "

"నాకు డబ్బుతో అవసరం లేదు"

"మరి ఎలా జీవిస్తారు ?"

"నేను విశ్వప్రేమచేత జీవిస్తాను. నాకు దప్పిక అవుతుందా, ఎవరో ఒకరు నాకు జలమివ్వడానికి పాత్రతో సిద్ధమవుతారు. నాకు ఆకలవుతుందా, ఎవరో ఒకరు తప్పక ఆహారంతో వచ్చి తీరుతారు."

"అయితే అమెరికాలో మీ కెవరైనా స్నేహితులున్నారా ?"

"ఆ- ఉన్నారు. నాకొక స్నేహితుడు తెలుసు- నీవే,'' అని స్వామి ఆ అమెరికను భుజమును తాకాడు. ఆ దివ్య స్పర్శలో, ఆ అమెరికన్ తాను విస్మరించిన రామునితో గల ఏదో ఒక అనంతమైన సనాతనపరిచయాన్ని అనుభూతికి తెచ్చు కున్నాడు. స్వామికతడు నాటినుంచి విడువలేని అనుచరుడైనాడు. అతడే ఈరకంగా వ్రాశాడు: "స్వామి హిమాలయాలనుంచి వచ్చిన ఒక జ్ఞానజ్యోతి. అగ్ని ఆయనను కాల్చలేదు. ఖడ్గం ఆయనను ఖండించలేదు. నిరంతరం ఆ మహాపురుషుని నేత్రాం చలాలలో పరవశానందాశ్రువులు సెలయేళ్లై పారుతుంటవి. ఆయన దర్శనమే ఒక నవజీవితోదయం.''

సర్వభూతమయానుభూతిపొందిన శ్రీశుకునికి మారుగా వ్యాసుని పిలుపుకు సమస్తభూతాలు మారుపలికినవని హైందవ శాస్త్ర ప్రతీతి. రాముడిట్టి విశ్వమయతను అడుగడుగునా చూపించాడు. ప్రకృతి ఆ మహర్షికి దాసోహమన్నది.

స్వామి అమెరికాలో అడుగుపెట్టింది మొదలు, పత్రికలు ప్రజానీకం అత్యంతంగా గౌరవించి, సమాదరించారు. దమ్మిడీ లేని భారతీయ సన్యాసి, అమెరికన్ కోటీశ్వరుల మూతపడిన హృదయకవాటాలను తెరిపించాడు. సాన్ ఫ్రాన్సిస్కో నివాసి యైన ఆల్బర్టు హిల్లర్ పండితుని అతిథిగా ఒకసంవత్సరన్నర స్వామి ఉన్నాడు. తనను ఎంత ప్రజలు గౌరవిస్తున్నా, శ్రీమంతుల ఆదరాభిమానాలకు తరుగులేక పోయినా, స్వామి తన నిరాడంబరతను వదలడు. శాస్తా పర్వతాలలో ఉండి నిత్యమూ అడవికి పోయి కట్టెలుకొట్టుకొని, తన కాతిథ్యమిచ్చిన

హిల్లర్ గృహానికి స్వయంగా మోపుమోసుకొని వచ్చి సహాయ పడుతుండేవాడు.

స్వామి తన దివ్యసందేశాలతో అమెరికాదేశమును ప్రబుద్ధపరిచాడు. అనేకులాయనకు అనుచరులైనారు. అనేక సంఘాలు, అనేక ఉద్యమాలు విశాల దృక్పథాలతో సంస్థాపింప బడినవి. అమెరికా అధ్యక్షుడైన రూజువెల్టు సైతం, ఈహిందూ సన్యాసికి జోహారుచేశాడు. ఆయన ధర్మప్రబోధాలలోని మాధుర్యం, సర్వజనులు రుచిచూచి తన్మయులైనారు. అందు కనే అమెరికా ప్రజానీకం, స్వామిని, "తిరిగి వచ్చిన క్రీస్తు" అని నిర్వచించుకున్నారు.

రోజుకు మూడునాలుగు మహోపన్యాసాలు స్వామి చేసేవాడు. ఒక్కొక ఉపన్యాసం రెండుమూడు గంటలు పట్టేదట. ధర్మచక్ర పరిభ్రమణార్థమై స్వామిచేసిన మహోప న్యాస సభలు జనులతో క్రిక్కిరిసిపోయేవి. స్వామి ఉపన్యాస ప్రారంభంలో చేసే ఆ ఓంకార స్మరణతోటే సభ ఏదో అవ్యక్త దివ్యస్థితికి అధిగమించేది. అందుకనే ఆయనను 'పరవశ ప్రవక్త' అని సంకీర్తించారు.

రాముడు భారతదేశంలోలాగా, అమెరికాలో సైతం ఏకాంతవాసం చేసేవాడు. ఒకసారి శాస్తాపర్వతశిఖరం (14,444 అడుగుల ఎత్తు) ఎక్కడంలో, అమెరికనులతో పందెం వేసు కొని, తానే ముందు పర్వతాగ్రాన్ని అందుకున్నాడు. బహు మతి రామునికే వచ్చింది. కానీ రాముడు దాన్ని తీసుకో లేదు. ఆయనకవి వినోద క్రీడలు. రాముడు బహుమతి

పొందడం, దాన్ని తిరస్కరించడం - ఈ వార్తను ప్రకటించిన పత్రికలు ఆనాడు ప్రముఖంగా ముద్రించుపోయినవి.

ఇంకొకసారి సిపాయీల పరుగెత్తే పందెంలో నల్లభై మైళ్లు ముందుపరుగెత్తి స్వామి గెలిచాడు. విద్యార్థిగా ఉన్న రోజులలో స్వామి ఎంత బలహీనంగా ఉన్నాడో చెప్పడానికి వీలులేదు అట్టి ఆతడు, తన సంకల్ప శక్తితో, ఇట్టి దార్ఢ్యతను ప్రదర్శింపచేశాడు దీర్ఘస్నాయువున్న నవయుగ శారీరక ప్రకృతికి, స్వామిచూపిన ఇట్టి చర్యలు గుణపాఠాలుకావా?

ఒకసారి ఒక శ్రీమంతురాలు రామునివద్దకు వచ్చింది. ఆమెకు రాముడు "గంగ" అని పేరుపెట్టాడు. ఆమె తన సర్వస్వం, తన సర్వసంపద రామునికే అర్పిస్తానని ప్రార్థించింది. సర్వత్యాగంచేసి సన్యాసాన్ని ఆశించింది. కాని రాముడా సంపదలేవీ ఆశించలేదు. ఆమెలోని సర్వత్యాగాన్ని దీవించి సముద్ధీప్తం చేశాడు.

ఒకనాడొక నాస్తికురాలైన అమెరికా దేశపు గొప్ప సినిమాతార, రామునితో ప్రత్యేకంగా ఏకాంతంగా సంభాషించడానికి అనుజ్ఞ నడిగింది. రాముడు నిరాటంకంగా అనుజ్ఞ యిచ్చాడు. రత్నఖచితాలైన ఆభరణాలతో ఆమె నాజూకుగా నలంకరించుకున్నది. అనేక సుగంధ ద్రవ్యాలు, లేపనాలు పూసుకున్నది. కేవలం ఆమె పూలతోటు చేయుబడినట్లు వచ్చింది. చిరునవ్వు ఆమె అధరాలపైన ఒక వినూత్న శోభతో లాస్యం చేస్తున్నది.

కానీ వచ్చింది–సాష్టాంగపడి ఏడువసాగింది. "స్వామీ! నేనుదుఃఖితను! నాకు శాంతి ప్రసాదించు. నా ఆభరణాలు, నా నవ్వులూ, నా అలంకారాలూ మొదలైనవాటినైపు చూడ వద్దు. అవి నా బాహ్యావేషాలు. నా ఆత్మ అశాంతిలో ఆకుల పడుతున్నది." రాముడామెను ఓదార్చాడు. పాశ్చాత్య నాగరి కతయొక్క భౌతికశోభలో గర్భితమైయున్న దుఃఖప్రకృతిని ఆమెలో స్వామి కనుగొన్నాడు......

ఇంకోసారి ఒక స్త్రీ రాముని సన్నిధికి వచ్చింది. ఆమె విచార సముద్రంలో మునిగి ఉన్నది ఆమెకున్న ఏకైక పుత్రుడు చనిపోయాడు. అట్టి విషాద భారంతో ఆమె వచ్చి, తనకు దుఃఖమును పోగొట్టమని స్వామిని అర్థించింది. రాము డిలా ఆమెకు చెప్పాడు: "రాముడు ఆనందమును విక్రయి స్తాడు. కానీ విలువ చెల్లించాలి" 'స్వామీ! ఏదికావాలంటే అది యిస్తాను. ఎంతైనా అడగండి వెదజల్లుతాను" అని అన్న దామె. "ఆనంద సామ్రాజ్యంలో, చెల్లింపవలసిన రూక (నాణెము) వేరు. రాముని దేశంలో చెలామణి అవుతున్న నాణెమును నీవు చెల్లించాలి" అని రాముడన్నాడు. "లాగే స్వామీ, ఏదైనా యిస్తాను" అన్నదామె.

"సరేమంచిది. అదిగో, ఆ నీగ్రోపిల్లవానిని పెంచుకొని, నీ స్వంతబిడ్డగా ప్రేమించుకో ఇదే నీవు చెల్లించవలసిన విలువ" అని రాముడన్నాడు.

"అలాగా! ఇది కష్టమైన పని."

"అలాగైతే, ఆనందం లభించడం కూడా కష్టమే సుమా" అని రాముడు ప్రత్యుత్తరమిచ్చాడు. కానీ రాముని బోధచేత, ఆమె అలాగే చేసి, శాంతిని పొందగలిగింది.

స్వామి ఈ విధంగా ప్రకృతిలోని జీవనపథంలో శృతిదప్పి బాధపడుతున్న హృదయాలకు అశ్వినీదేవతవలె దివ్యౌషధ ప్రదానం చేశాడు.

రామతీర్థస్వామి హంసవలె ఆనందాకాశంలో నిరంతరం విహరించేవారు. జింకలాంటి త్వరితగామి. వారి కార్యదర్శి మిస్ హైలర్, గ్రేట్ పసిఫిక్ కంపెనీ మేనేజరును శాన్‌ఫ్రాన్సిస్కో నుంచి న్యూయార్కుకు స్వామికి కన్సెషన్ టిక్కెట్టు ఇమ్మని అడగడానికి వెళ్లింది. అప్పుడు మేనేజరు ఇలా అన్నాడు: "వారికా? వారికి నేను ప్రత్యేకంగా, ఉచితంగానే ప్రయాణానికి ఏర్పాటు చేస్తాను. వారి నవ్వే ఎంతో ఆకర్షణీయం."

స్వామిలోగల బ్రహ్మానందం, ఆయన నవ్వులోనే కనబడుతుంది. సెయింటులూయీలో జరిగిన సర్వమత మహాసభలో రాముడు అధ్యక్షత వహించాడు. దాన్ని గురించి వ్రాస్తూ పత్రికలు, అన్నింటిలోకీ చూడదగిన మహోన్నత విషయం శ్రీరామతీర్థస్వామియే యని వ్రాశాయి.

భగవంతునికీ మానవునికీ సంబంధించిన అనేక తాత్త్వికప్రశ్నలకు స్వామి పకపకా నవ్వేవారు వారి ఆ ఆనందానుభూతే సమస్తప్రశ్నలకు సమాధాన మనిపించేది.

అమెరికాలో వుండేటప్పుడు రామతీర్థులను ఒక వృద్ధురాలు ఆంతరంగికంగా దర్శించింది. ఆమె గృహవిషయాలు,

నిత్యమూ పడుతున్న కష్టాలు చెప్పుకొని ఏడ్చింది. స్వామి పద్మాసనం వేసుకొని, కండ్లుమూసుకొని వింటున్నాడు. ఒక్క మాటైనా పెదవి విప్పి మాట్లాడలేదు. జాలిగా పలవిస్తున్న ఒక వృద్ధురాలి ఆవేదన అరణ్యరోదనంలాగా ఉంది. ఇట్లా స్వామి ఉండడం మర్యాద కాదనుకుందామె. పైగా భారతీయులు అవివేకులు, సిగ్గన్నా లేకుండా గర్వంగా రాయిలాగా కూర్చోవడం అసమంజసమనుకున్నది. వింటూనే ఆమెమాటలు విననట్లు కండ్లు మూసుకొని కూర్చున్నాడు రాముడు. ఆమె విచారగాథ పూర్తిచేయగానే, స్వామి కనులు విప్పాడు. కండ్లల్లో కరుణ, సముద్రగర్భంపొంగినట్లు పొంగింది. "అమ్మా" అన్నాడు స్వామి. తర్వాత ఓం, ఓం, ఓం, అని ఓంకార మంత్రం ఉచ్చరించాడు. ఏదో ఒక అనర్వచనీయ మహానందంలో ఆవృద్ధురాలు ప్రకంపించిపోయింది. ఆమె, విచార బాధాశ్రయమైన దేహవాసనలను దాటి దాటి, పీటన్నిటికీ అంటని "నేను జగన్మాతను"అనే అఖండ స్థితిని అనుభవించింది. నాటి నుంచి ఆమె ఒక జ్ఞానిగా మారింది. రాముని బ్రహ్మతేజం ఇలాంటిది.

అమెరికాలో ఒక సరస్సుతీరంలో ఒక ఆరోగ్యాశ్రమం ఉన్నది. స్వామి అక్కడ కొన్ని దినాలున్నాడు. ఆ ఉన్నప్పుడు శ్రీ స్వామిచేసే ఓంకార గానంచేత, వారి సాన్నిధ్యంచేత అనేక మంది వ్యాధిగ్రస్తులు ఆరోగ్యం పొందారు. దేహారోగ్యమే కాదు, మానసిక శాంతికూడా పొందారు. స్వామినే వైద్యుడనుకున్నారు రోగులు.

అమెరికాలో స్వామి అనేక విశ్వవిద్యాలయాలలో ఉపన్యసించాడు. కేవల బాహ్య విద్యావిజ్ఞానాలతో తృప్తిపడుతున్న మానవులకు జీవితోపయోగములైన వేదాంత జ్యోతిని స్వామి చూపించాడు ఒక విశ్వవిద్యాలయంలో స్వామి "భారతదేశానికి ప్రపంచం ఉన్న ఋణం" అనే ఉపన్యాసమిచ్చారు. ఆ ఉపన్యాసంవిన్న సర్వులూ ప్రముగ్ధులైనారు. విశ్వవిద్యాలయాధ్యక్షుడు స్వామికి బహూకరించడానికై, కొన్ని ఉత్తమ గ్రంథాలు, కుసుమాస్త్రాను తెమ్మన్నాడు. ఆ తెచ్చిన గ్రంథాలలో ఒక గ్రంథపు అట్ట కొంచెం చినిగివున్నది. అధ్యక్షుడప్పుడు కుసుమాస్త్రానెవ్వుచూచి ఇలా అన్నాడు. "స్వామి ప్రసంగం ఇప్పుడు వినలేదా? ఎవరికీ గ్రంథాలు బహూకరింపబడతాయో నీకు తెలీదా? భగవానుడైన రామునికి, విశ్వవిద్యాలయం సమర్పించుకోవలసిన గ్రంథాలు సుమా ఇవి. ఇంకో మంచి గ్రంథం చూచి తీసుకురాండి."

అమెరికాదేశము, స్వామి దివ్యసందేశామృతధారలలో ముగ్ధమై, ఏ రకంగా తబ్బిబ్బైందో చూపగల అనేక పత్రికారచనలున్నాయి అనేక జనశ్రుతులున్నాయి. అవన్నీ ఈ సంక్షిప్తచరిత్రలో రచించడానికి అవకాశం లేదు. స్వామి చేసిన ప్రసంగాలు, ఉపన్యాసాలు, పశ్చిమఖండాన్ని ఎంతగా కదలించి నిద్రలేపినవో వ్రాయడానికి చేతగాని పని. ఆ మహాత్మునికర్మ సూర్యకర్మ! అయితే, స్వామి శిష్యులను చేర్చుకోవడంలో, మతాలు నిర్మించడంలో, ఏవేవో స్థూలదృశ్యకర్మలు చేయడంలో తన కర్మను చూపించలేదు. మానవునిలోని దివ్య

శక్తిని, ధర్మతేజాన్ని ప్రబుద్ధపరచడంలో స్వామి చేసిన మహా కర్మ అవాఙ్మానస గోచరమైంది.

విశ్వవిద్యాలయాలలోని బీద భారతీయ విద్యార్థులకు స్వామి అనేక వసతులు ఏర్పరిచాడు. మానవహృదయ సంస్కరణానికి స్వామి సందేశములు అనేక శాఖలలో అమోఘకృషి సలిపాయి. ఆయననోటినుంచి వెలువడిన సందేశాలకు, వానికి రూపమనదగిన ఆయన వ్యక్తిత్వానికి, అమెరికనులు పరవశులైనారు. ప్రపంచాన్ని దిద్దగల ధర్మజ్యోతిని, సత్యజ్యోతిని స్వామిలో అమెరికనులు సందర్శించారు. స్వామి ఉపన్యాస శీర్షికలలోనే ఒక అమోఘ సందేశం ఉంటుంది ఆయన ఒక ఉపన్యాసానికి ముగ్ధులై అనేక విశ్వవిద్యాలయాధ్యక్షులు ఏకగ్రీవంగా ఒక సారి ఒక పండిత బిరుదమిచ్చారు. స్వామి, చిరునవ్వున నవ్వి "ఇదివరకున్న స్వామి బిరుదే నాకు బరువు" అని ఆ అసాధారణ బిరుదాన్ని తృణీకరించాడు. ఓహో! ఎట్టి అంతర్ముఖత! ఆయన జీవితంలో ఇలాంటివి అతిసామాన్యం. శంకరుడన్నట్లు మహాత్ములు గురుతర కృపాభారంచేత వంగుతారు. స్వామిచేసిన సేవ ఇన్ని విధాల అమెరికనులలో తక్కువైన ఆధ్యాత్మిక బలాన్ని చూపించి, భారతీయులలో తక్కువైన ఆధ్యాత్మిక భౌతిక బలాలను చూపించి, ఉభయులకు కావలసిన సామరస్య ధర్మ సందేశాలను స్వామి తన దైవప్రేరిత వక్తృత్వంలో ఎంత మనోజ్ఞంగా చిత్రించాడు! "సాధారణ మహాపథము" అను పేరుతో, స్వామి తన ధర్మ చక్రము నీ విధంగా త్రిప్పాడు. స్వామి సందేశాలతో అమెరికా ప్రతిధ్వనించింది. భారతదేశ

సముద్ధరణాలలో, సర్వజగత్సముద్ధరణమున్నదని స్వామి అమోఘ సందేశాలలో నిరూపించాడు. కుల, మత, జాతి ద్వేషముల యొక్క సర్వ రూపాలను పారద్రోలడానికి, స్వామి తన ప్రసంగాలలో తన హృదయకారుణ్యాన్ని ఎంతో పంచిపెట్టాడు. దాదాపు రెండు సంవత్సరాలన్నర స్వామి పశ్చిమఖండ పరివ్రాజకుడై ధర్మవ్యాప్తం చేశాడు. ఆ ధర్మబోధలన్నీ *"శ్రీ రామతీర్థ సంపూర్ణ వేదాంత సారస్వతం" అనే గ్రంథంలో చూడవచ్చు.

సూర్యుని కిరణం పడిన చోటల్లా వెలుగుగా మారినట్లు, స్వామిదృష్టి సోకిన చోటల్లా ఒక స్వర్గంగా మారింది. జగద్రంగం మీద పెరిగిపోయిన జీవపశువధాయజ్ఞ కార్యాలను ఆపడానికై రామ బోధసత్త్వ డింకంగా పరివ్రజించాడు. స్వామి బోధలచే అనేక స్త్రీలు, పురుషులు కొందరు ధర్మసేవకై తమ సర్వస్వాలను పరిత్యజించి నిలిచారుకూడ.

నెల్సన్ సతి ఒక అమెరికా స్త్రీ. గొప్ప విద్యావతి. సర్వసంగపరిత్యాగియై, సన్యాసినియై, భారతీయ సన్యాసినీ వేషం ధరించి, ఇండియాకు వచ్చి ఎంతో సేవచేసింది. ఈమె సన్యాసినీ నామం సూర్యానంద అని రాముడు పెట్టాడు. అనేకులీరకంగా స్వామి బోధలచే ప్రబుద్ధులైనారు. ఈ భారత జ్యోతి, ఈ వేదాంత మహాజ్యోతి ఈ విధంగా పశ్చిమఖండమున వెలుగుచూపింది.

* ఈ గ్రంథాలు ఈ ఆశ్రమంలో తెలుగులో లభిస్తాయి.

"...ఈ దేశంలో శ్రీరామతీర్థస్వామిని ప్రేమవశులై హృదయమూలయందారాధించే ప్రజలు చాలామంది యున్నారు. ఆయన ఏవిధంగా నిజమైన సన్యాసియై జీవించాడో, ఏవిధంగా క్యాలిఫోర్నియా పర్వతపు లోయలలోని మొరటుగ్రామీణుల యొక్క హృదయాలను చూరగొన్నాడో, ఏవిధంగా ఆయన మహామహా ప్రముఖ పత్రికాలో చేసిన తన ఉపన్యాసాలమీద అభినుతిరచనలు కట్టగట్టి సముద్రంలో పారవేశాడో, ఏవిధంగా ఆయన తన ఉపన్యాసాలను వినడానికి వచ్చిన సభ్యులనుంచి వసూలుచేసే ప్రవేశరుసుమును నిరాకరించి, ఆ ధనమును, నీవే భరించవలసినది" అని తన ఉపన్యాసాల నేర్పాటుచేసిన మిత్రునకు చెప్పి జనసామాన్యానికి సైతం ఉపకరించాడో, ఇక్కడ ప్రజలప్రేమ ప్రసంగాలలో మనం వినగలం అమెరికా దేశం ఇంతవరకు కనీవినీ యెరుగని హిందూజాతి శిరోమాణిక్యమాయన. తన జీవితమందు మహామహోన్నత ధర్మసూత్రాల ప్రతిబింబితం చేసుకున్న మహర్షి వరిష్ఠుడాయన. మహాత్ములలో కెల్ల పరమశ్రేష్ఠుడాయన. ఆయన హృదయంలో విశ్వాత్మక ప్రేమ ప్రతిబింబించింది."

[లాలా హరిదయాల్ యం. ఏ.]

(ది మోడర్న్ రివ్యూ, జులై 1911)

ఓం

౨౦

# మాతృదేశ పునరాగమనం

అమెరికానుండి స్వామి భారత వర్షానికి వస్తూ మార్గ మధ్యంలో ఈజిప్టులో దిగారు. అక్కడ కైరోలో మహమ్మదీయ మహాసభా మధ్యమున, వారిమసీదులో రామతీర్థస్వామి పారశీక భాషలో ఒక మహోపన్యాసం చేశారు. నాటి మహోపన్యాసాన్ని అరబ్బీ ప్రముఖ పత్రిక "అల్వాహాబ్" (Al wahab) "భారత తత్త్వవేత్త" అనే శీర్షిక క్రింద సమగ్రంగా ప్రకటించింది. ఈజిప్టు దేశీయులు స్వామి ప్రబోధాలలో, మహమ్మద్ ప్రవక్తయొక్క సత్యవాణిని విని, స్వామి ముందు మోకరిల్లారు.

ఆయన పుట్టింది భారతదేశంలో. పెరిగింది భారతదేశంలో. గడిపింది తీవ్రవైరాగ్యదీప్తమైన ఆర్య సన్యాసిజీవితం. కానీ, నిజమైన భారతపుత్రుని స్వరూపం, నిజమైన సన్యాసి యొక్క జీవితస్వరూపం స్వామి చూపించాడు. సర్వజగత్తును తన ఆలింగనంలో విలీనం చేసుకోగల భారతాదర్శమును, హైందవ మతాదర్శమును స్వామి చూపి, భారతచరిత్రకు ఒక బంగారు గోపురమును నిర్మించాడు!

రాముడు నిజంగా బ్రహ్మానంద మహాసామ్రాజ్యాధిపతి. స్వామి అందుకే తరచుగా తనను 'రామపాదుషా' అని పిలుచుకొనేవారు. శిశువువంటి ఆయన అమాయకత అద్వితీయమైంది

ఇండియాకు వచ్చేటప్పుడు స్వామి పోర్టుసెడ్‌లో లార్డుకర్జన్ వస్తున్న స్టీమరులో ఎక్కడానికి నిరాకరించాడు. "ఒకే పడవలో ఇద్దరు ప్రభువులు ప్రయాణం చేయలేర"ని స్వామి నిరాకరించి తర్వాత నావలో పయనించాడు. ఇది గర్వంకాదు. సామాన్యులు ఏ పదవీవైభవాలు చూచి వంగుతారో, ఆ పదవీప్రతిభలను, మహాత్ములు ఎంత నిరసనంగా చూస్తారో, వారిలోని ఆ తరుగని ఆత్మశ్రీ ఎంత ఉన్నతమైందో మనం గ్రహించాలి.

1904 డిశెంబరు 8 వ తేదీ స్వామి బొంబాయిలో దిగారు. అక్కడ ప్రజానీకం అపూర్వానందాతిరేకంతో స్వామికి సుస్వాగతమిచ్చింది. బొంబాయిలో ఒకవారం స్వామి ఉన్నాడు. వారి ఆ ధర్మ సందేశామృతాన్ని సర్వజనులు ఆస్వాదించి పరవశులైనారు.

తదుపరి స్వామి, శివగుణాచార్య స్వామితో కలిసి మథురాకు పోయారు. దారిలో నాసిక, హోషంగాబాద్‌లో ఆగి జనసామాన్య మహాసభలలో వేదాంత ధర్మోపన్యాసాలిచ్చాడు. నాటి ఆయన ఉపన్యాసాలలో, మహోన్నత రాజకీయవిషయాలు గర్భితమైయున్నవి. అయితే రాముడు అంతర్ముఖుడైన మహర్షి. ఆయన రాజకీయప్రసంగాలు సైతం ఇంకొకరూపంలోని సత్యధర్మ సందేశాలే. ఆయన దేశభక్తుడుగా ప్రసంగించలేదు. తానే భారతవర్షమై ఏతద్దివ్యానుభూతితో ప్రసంగించాడు.

స్వామి మథురాలో శాంతి ఆశ్రమంలో ఉన్న ఆ రోజుల్లో ఒకనాటి ఉదయం 8 గంటల సమయం. పురాన్

ఒక మిత్రునితో కలసి లాహోరునుంచి అప్పుడే వచ్చాడు. స్వామి గదితలుపు తెరచి ఆహ్వానించాడు. స్వామీ పురాన్ సింగు కలువక మూడుసంవత్సరాలప్పటికి. అది చలికాలం. ఒక కాషాయపు దుప్పటి కప్పుకొని స్వామి ఉన్నాడు. ఏదో దివ్యతేజం తొణికిసలాడుతున్న నేత్రాలతో పురాన్ సింగును చూచి స్వామి ఇలా అన్నాడు: "త్యాగమే (స్వార్థబలి దానము) దేశవిముక్తి కలిగిస్తుంది. దేశవిముక్తికై రాముని శిరస్సు ముందు పోవాలె. తరువాత పురాన్ సింగుది. తరువాత ఇంక అనేకమంది శిరస్సులు బలిదానం కావాలె. అప్పుడు భారతవర్షం, మాతృభూమి, మన జన్మభూమి విముక్తి పొంది తీరుతుంది." సర్వవిధ పతనావస్థలో ఉన్న భారత దేశమును విముక్తిచేయడానికై, భేదభావ రావణునిచేబడిన సీతను విడి పించడానికై ధనస్సు సంధించిన వీరరామునివలె, రాముడు నిలుచున్నాడు భారతవిముక్తిలో, సర్వప్రపంచ విముక్తి, సర్వ ప్రపంచ క్షేమం శ్రీరామతీర్థ భగవానుడు గుర్తించాడు.

ఇంతలో ఇరువురు నూతన వ్యక్తులు స్వామిని చూడ డానికి అక్కడికి వచ్చారు వాండ్లు స్వామికి నమస్కరించారు. వాండ్ల నమస్కారాలకు కృతజ్ఞతగా స్వామి వినిర్మల ప్రేమతో పకపకా నవ్వసాగాడు. నవ్వాడు, నవ్వాడు, కడుపు చెక్క లయ్యేలాగు స్వామి నవ్వాడు. నవ్వాగిపోయిన తరువాత స్వామి అన్నాడు: "నాదేశీయులారా! రాముని పరిశోధించ డానికి వచ్చారా? రాముడు మీకు తన హృదయాన్ని విప్పి చూపుతున్నాడు. ప్రపంచంలో చేయదగిన ఉత్తమకార్యం

రాముని శోధించి పట్టుకోవడమే ప్రపంచ మప్పుడు మీ పాదా లకు దాహోహమంటుంది. "

అక్కడున్న పురాణ మొదలైన వాండ్లందరూ ఈ సంఘ టనకు ఆశ్చర్యపడ్డారు. ఆ వచ్చిన నూతన వ్యక్తులు స్వామి పాదాలమీద వ్రాలి ఈరకంగా విన్నవించుకున్నారు : "స్వామిజీ ! క్షమించండి. మావిధిప్రకారం మేమువచ్చాము. మీ ముఖమును చూడగానే మా హృదయాలు కరిగిపోయినవి. మీ ప్రేమ మమ్ములను జయించింది. మేము పాపాత్ములం"

ఈరకంగా ఆ గవర్నమెంటు సి. ఐ. డీలు పశ్చాత్తా పంలో వెళ్ళిపోయారు. సత్యశిఖరంపైన సుస్థిరులైన మహాత్ముల కేమిభయం ? పవిత్రమైన గంగలోపడి మురికి కాలువలు సైతం పునీతం కావా ? చైతన్యపు దివ్యాలింగనంలో జగన్నాథ మాధవులనే త్రాగుబోతులు, భగవన్మధుపానమత్తులుకా లేదా? సాక్షాత్కార శిఖరాగ్రాసనులై, పనిచేసే ధర్మవీరుల శక్తి అకుంఠితం ! అప్రతిహతం !

శివగుణాచార్యస్వామి, స్వామిని అనేక మహారాజులను ఆశ్రయించి ధనమును కూడబెట్టి, ఏదోఒక సంస్థను స్థాపిద్దా మని ఎంతో బోధించాడు. కానీ, ఏవేవో శుష్కకర్మ కలా పాల సంరంభాలకు రాముడు భ్రమిసేడు కాలేదు. వేదాంత సూర్యునివలె తాను ఒక మహాకర్మ చేయదలచాడు.

మూల్త్రాలో కొందరు మిత్రులు స్వామి నొకనాడు కలసి, "స్వామీజీ, మీ భావప్రచారానికి, మీ సిద్ధాంతప్రచా రానికి, మీరొక నూతన సమాజాన్ని స్థాపించండి" అని అడి

గారు. రాముడామాటలు వినంగానే ప్రేమపరవశుడై పోయాడు. ఆయన నిమీలిత నేత్రాలనుంచి అశ్రుప్రవాహాలు ధారలై కారసాగాయి. ప్రపంచమంతా ఆయన కౌగలించుకోబోతున్నట్లు చేతులు చాపి ఇలా అన్నాడు: "భారత దేశంలోని సంఘాలన్నీ రామునివే. వాని ద్వారానే రాముడు పనిచేస్తాడు. క్రైస్తవులు, ఆర్యసమాజీకులు, హిందువులు, పార్శీలు, మహమ్మదీయులు, నాయిష్టదేవతయైన భారతవర్షముయొక్క దుగ్ధపానంలో పెరిగిన సర్వులూ నా సోదరులే. వెళ్లి— చెప్పండి— రాముడు మీ అందరికి చెందినవాడని. నేను సర్వులను ఆలింగనం చేసుకుంటాను. నేను ఒక్కరిని కూడా వదిలిపెట్టను. నేను సమస్త పృథ్విపై ప్రేమను వర్షిస్తాను. నేను సమస్తభూమిని ఆనందంలో స్నానం చేయిస్తాను. ఎవరైనా నన్ను వ్యతిరేకిస్తారా? ఇదిగో అతనికి నేను హృదయపూర్వక స్వాగతమిస్తున్నాను నేను ప్రేమను వర్షిస్తాను. అన్ని సంఘాలునావే. నేను ప్రేమతరంగాలను లేపుతున్నాను. ప్రతిశక్తీ నాదే. సర్వం నేనే. ఆహా! నేను ప్రేమను వర్షిస్తాను... ..."

బహువిధ విభేదభావ సంకీర్ణమైన జగతికి ఇట్టి హృదయమే శరణ్యమివ్వగలదు. ఇట్టి మహాపురుషులను అవతారమూర్తులనడానికి కారణం — భగవంతునిలో చూడగలిగిన ఆ పరమసత్యదృష్టిని, వీరిలో కనుగొనగలగడమే.

మథురలో స్వామికి యమునాతీర సైకతశయ్యలు మహాప్రీతి ఆ యమునాకూల సైకతశయ్యలపై, స్వామి బ్రహ్మానందబాష్ప యమునాస్రుత నేత్రాంచలాలతో ఉపవిష్టుడై

యుండేవాడు. ఆయన దర్శనంలో, ప్రతివ్యక్తి తన విచారజీవితాన్ని విస్మరించాలసిందే. ఆయన ఆ యమునాతీర విశాల సైకతసీమలపై చేసే ధర్మ ప్రసంగాలను వినడానికి ఆబాల గోపాలం వస్తుండేవారు. శతవృద్ధులు సైతం వచ్చి తన్మయులయ్యేవారు.

తదుపరి స్వామి పుష్కరసరోవరతీరానికి నిర్గమించాడు. స్వామి ముఖ్యశిష్యులైన నారాయణస్వామి జపాను, శ్రీనగరము, పెనాంగ్, బర్మా, సిలోన్, ఆఫ్రికా, పోర్టుసైడ్, కైరో (ఈజిప్టు), అలగ్జాండ్రియా, గోజో, మల్టా, తునిస్ (Tunis), ఆల్జిరిస్ (Algiers), మొరాకో (Morocco), జిబ్రాల్టర్ మొదలైన ప్రదేశాలలో ధర్మప్రచారసంచారంచేసి, చివరకు లండన్ 1903 సెప్టెంబరులో చేరి ఒక అయిదుమాసాలుండి జబ్బునపడ్డాడు. స్వామి ఆజ్ఞచేత తిరిగివచ్చి స్వామిని 1905 జనవరిలో పుష్కరతీరంలో కలుసుకున్నాడు.

పుష్కర సరోవరతీరంలోని కిషన్‌ఘర్ రాజగృహంలో స్వామి నివాసం. ఆ పుష్కరసరోవరంలో మొసళ్ళపుట్ట. సంసారమనే మొసలినే నిర్జించిన ఆ మహర్షికి, వాటిమధ్యనే స్నానపానాలు. అవి ఆయనను ముట్టవికావు.

ఆ పుష్కర సరోవరారణ్యం రాముని విహారరంగం. అక్కడ జనసమర్దం లేదు. అప్పుడప్పుడు స్వామి స్నేహితులు ఏ పది పన్నెండుమందో వచ్చి పోతుంటారు. సాయంకాలం, అనుచరులతో, స్వామి పుష్కర పర్వతంమీదికి విహారానికి వెళ్ళేవాడు. ఆ ప్రయాణానికి అంతుండదు. భగవత్తన్మయుడైన

రామపరమహంసకా పర్వతారణ్య సంచారం, ఒక సరోవర విహారమే. అనుచరులు నడువలేక కాసేపు కూర్చొంటారా, స్వామి కూర్చొనివ్వడు. ఓంకార సంస్మరణంచేసి లెమ్మనే వాడు. బలహీనతే ఆయనకు పనికిరాదు. ఇతరులకు ఆ అరణ్య సంచారం ప్రాణగండం. కాని స్వామికి లీలావిహారం. ఆ మహా ర్షికి, ఆ సంచారం, కేవలం భగవంతునిలో సంచరించినట్లు ఉండేది. ఒక్కొక్క సారి స్వామి ఒకకొండరాయిపై కూర్చొనే వాడు. ఆ తన్మయమూర్తి ఇట్లు సంభాషించేవాడు :

“ఈ మానవులు భగవంతుని ఎందుకు చూడలేరు. భగవంతుని చూడలేనివారిని రమ్మనండి రాముని దగ్గరకు రమ్మనండి. భగవంతుడు కనపడతాడు !”

స్వామి కన్నులు నిమీలితములయ్యేవి. అశ్రువులు కాలువలు గట్టి ప్రవహించేవి ముఖము తేజోమండలమయ్యేది. విశ్వసర్వమును ఆలింగనం చేసుకుంటున్నాడా అన్నట్లు, ఆయన విస్తృత బాహువులు గాలిలో ప్రకంపించేవి. “భగవంతుడు ! భగవంతుడు ! ఇదుగో ఇక్కడ ఉన్నాడు. భగవంతుని చూడ దలచినవాండ్లు రండి” అని పలుకుతూ స్వామి మౌనంలో మునిగిపోయేవాడు పై పెదిమతో కొంచెం క్రింది పెదిమను ఒత్తిపట్టేవాడు. అప్పుడే తల్లిని కనుగొన్న శిశుముఖవైఖరి ఆయన ముఖంలో ప్రకాశించేది. పసిపిల్లవంటి నమ్మకంతో ఆయన అరుణాధరాలు విడివడిఉండేవి. స్వామి ప్రసంగిస్తూ ప్రసంగిస్తూ, పారవశ్య నిర్భరతచేత, మధ్య మధ్య అలాగే మౌన సముద్రంలో మునిగిపోయేవాడు. ఉత్తుంగతరంగితమై, విశాలమై

పోయే ప్రవాహంలాగా, ఆయన దివ్యమౌనం అలాగే సాగి పోయేది.

స్వామి పరుల విమర్శలను సహించడు. ఎవరైనా ప్రసంగవశాత్తు విమర్శలకు దిగుతారా, వెంటనే స్వామి, "దేవాలయ ఘంట వినబడడం లేదు. హుష్! వ్యక్తిగత విమర్శవద్దు" అని వారించి వారిచేత ఓంకార స్మరణ చేయించే వాడు.

"మీ అందరికీ శ్రద్ధపోయింది. ఓంకారోచ్చారణ నిరంతరం జరగాలె" అని స్వామి యనుచరులకు ప్రేరణచేస్తుండే వాడు. నిజమిది: శ్రీ రామతీర్థ జీవితం ఒక ఆకాశగంగ. ఆ గంగాగర్భంలో నిరంతరం ఓంకారరావమే వినబడేది. ఆయన జీవితమే ఓంకారమనడం సమంజసమే. ఆయన బోధలు, ఆ ఓంకార వ్యాఖ్యానమే-ఓంకార నామస్మరణ స్వామికి ప్రాణప్రదం. స్వామికిగల ఓంకార ప్రీతినిగూర్చిన ఒక వినోద విషయం:

స్వామివద్ద ఒకవంట చేసే యువకుడుండేవాడు. స్వామీ, అనుచరులు, భోజనంచేస్తుండేవారు భోజనంచేస్తూ, ఏదైనా కూర నడిగేవారు. దానికి జవాబుగా నతడు ఊరక ఓం అనే వాడు. ఆకూర తెచ్చిన పిదప ఆతడు, 'స్వామీ ఇదిగో' ననే వాడుకాదు. ఓం అనేవాడు. ఏ సందర్భంలోనైనా సరే నతడు ఓంకారోచ్చారణ చేయడం చూచి వచ్చిన స్వామి మిత్రులు కడుపుచెక్కలుగా నవ్వుకొనేవారు. ప్రతిదానికీ ఒకటే ఓం. ప్రతిప్రశ్నకూ ఒకే ఓం అని ఆయువకుడు జవాబు చెప్పేవాడు.

ఈ వినోదవిషయంలో, స్వామికిగల భగవన్నామ ప్రీతి మనం కొంత గ్రహించవచ్చు. భగవన్నామమేకదా మహాత్ముల జీవనాధారం !

పుష్కరసరోవర తీరంనుంచి స్వామి వ్రాసిన లేఖలు, వ్యాఖ్యలు, ప్రసంగించిన ప్రబోధా లనేకం ఉన్నాయి. వానిలో, స్వామి జగద్ధితహృదయం ఎంతో బాగుగా చూడవచ్చు. అప్పటి ఆయన రచనలలో సత్యమైన దేశభక్తిని మనం చూడగలం.

పుష్కర సరోవర తీరంలో మూడు మాసాలున్న తరువాత రాముడు నారాయణస్వామితో కలిసి జయపూర్ వెళ్ళి అక్కడ కొద్దిరోజులున్నారు. మహోన్నత ధర్మప్రసంగాలతో, రామభగవానుడు ప్రజలమధ్య ఒక జ్యోతిగా ప్రకాశించాడు.

స్వామిది సింహప్రకృతి. సింహాలరణ్యగుహాగర్భాలలో స్వేచ్ఛగా ఉంటాయి. ఎప్పుడో రాత్రిపూట, పరిసర గ్రామంలో ఒక్కదూకుదుమికి, ఏ జంతువునో నోటకరచుకొని తిరిగి యరణ్యాల్లో జొరబడతాయి. వేదాంతకేసరియైన స్వామి ప్రజలమధ్య ఒక దుముకు దుముకుతాడు. తిరిగి చివాలునపోయి, తన దుర్గమారణ్యగిరిసీమలలో వ్రాలుతాడు. రామ మహర్షి జీవిత విధానమిది.

తాను మహారణ్య విశ్వవిద్యాలయాలలో పరిశ్రమించి గడించిన బ్రహ్మానంద సంపదను రామతీర్థస్వామి సర్వమానవులకు వేయిచేతులతో పంచిపెట్టాడు. ఇంక రామపరమహంస

జనులమధ్య నిలువదు. రామకృష్ణ పరమహంసలవారన్నట్లు లోకహితకర్మకై, మహాజ్ఞానులయందు పరమాత్మ కొట్టిగింజంత శుద్ధమాయను ఉంచుతాడట. పనికాగానే ఆ రవ్వంత మాయ పోతుంది ఇక వారు చిక్కరు. ఇక కేవల బ్రహ్మాకాశయానమే!

తిరిగి రామపరమహంస, జనపదాలు విడిచి, హిమవత్పర్వత మహారణ్యాలకు నిర్గమించాడు. ఇక తదేక బ్రహ్మయానమే! రావణ సంహారకర్మ యిన పిదప రాముడు తన యయోధ్యా సింహాసనస్థుడైనాడు. రామతీర్థ భగవానుడింక సమగ్ర నైష్కర్మ్మ! సమస్త ప్రవృత్తి శాఖలను విడచి, ఎగిరి ఎగిరి నివృత్తి పర్వతశృంగాలపైకి ఎగిరి ఆ బ్రహ్మాకాశంలో రామ పరమహంస గానం చేయసాగింది. ఆ గానం కొంచెం వినండి :—

పోనిమ్ము ఓ మహామధుర వేదనము
స్వస్తి వ్రాతల కుపన్యాసంబులకును !
కీర్తి ప్రతిష్ఠలు వలదు సుంతయును !
గౌరవమా అది బుద్ధిహీనతయె,
మరి యగౌరవమది అర్థహీనంబు !
బ్రతుకెందుకీ యాటబొమ్మల కొరక ?
తర్కపదార్థ విజ్ఞానశాస్త్రములు
వట్టి పిచ్చివి! పాప మవి నన్ను చూచి
పోగొట్టుకొనుగాక తమ గ్రుడ్డితనము
కలలో ఒక దివ్యవాహిని పారు
జాగ్రద స్థితినది పెరుగును పెరుగు,

అప్పుడప్పుడా దివ్యవాహిని పొంగి
దేహేంద్రియాది తటంబుల ద్రెంపి
ఆకాశమెత్తు వరదలై పారు
ఆ మహాగంగ విశ్వవ్యాప్తమగుచు
వరదలై ముంచెత్తు సర్వలోకముల
అది యకాండ జలప్రళయమహాచు రేగు

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

వరదలై వరదలై పొంగులుబారి
ఇదెవచ్చుచున్న దానంద వారాసి
ఇదెవచ్చుచున్న దఖండ మోదంబు
కడుపుచెక్కలు వోవు నవ్వువచ్చెడిని !
పొంగుచున్నది బ్రహ్మమహాన ప్రశాంతి

ఓం

ఓమ్

# మహానిర్వాణం

1905 నవంబరులో రామతీర్థ స్వామి నారాయణ స్వామితో కలిసి హరిద్వార హృషీకేశాలమీదుగా, గంగానదియొక్క ఆవలి తీరంలోగల ఒక దుర్గమోదుగ్రమైన మహారణ్యగర్భంలోని వ్యాసాశ్రమానికి నిర్గమించాడు ఈ ప్రదేశం హృషీకేశానికి 30 మైళ్ల దూరంలో ఉంటుంది. ఇక్కడే వ్యాసగంగవచ్చి, గంగానదిలో కలుస్తుంది అక్కడ గంగపొడుగునా భయంకరాతి భయంకరమైన, ఒక పెద్ద అరణ్యమున్నది. దీన్నే బీన్‌ఫారెస్టంటారు. ఈ కీకారణ్యంలోనే భారతమతవాఙ్మయ పితామహుడైన, వేదవేదాంత సముద్రుడైన, శ్రీమద్వేద వ్యాసమహర్షి తపస్సుచేశాడని జనవ్యవహారం. ఆపారాశర్య భగవానుని పాదపద్మ చిహ్నలను కాపాడడానికేమో, ఆమహారణ్యం మానవమాత్రులకు దుర్గమమైయున్నది. ఆ నిబిడాంధకారబంధురారణ్యంలో జ్ఞానవైరాగ్యతేజం తప్ప, ఇంకొకతేజం, నిరుపయోగం. అక్కడికి పోవాలంటే, అగడ్తవలె దుస్తరమైన గంగానది ఒకవైపు. ప్రాణాలు తెగించితేనే తప్ప ఎవరూ ఈనది దాటడం దుస్తరం.

రామ పరమహంస ఈ మహారణ్యంలో ప్రవాలింది. ఆ యరణ్యంలో ఒకదానికొకటి యరమైలు దూరంలో ఉండేలాగు పర్ణశాలలు రామనారాయణస్వాములు ఏర్పరుచుకున్నారు. స్వామి వ్యాసాశ్రమంలో నిరుక్తము, సామవేదమును పఠించి,

ఏ తద్ధ్యానము చేయసాగాడు. వేదమంత్రసుధానుభూతిలో స్వామి పూర్ణ నిమగ్నత పొందాడు. భారతదేశంలోని కొందరు పండితులు వేదాలకు చేసిన అపవ్యాఖ్యానాలు చూచి స్వామి పకపకానవ్వేవాడు. సత్యద్రష్టయైన ఆ మహర్షికి, వేద హృదయం అర్థంకావడంలో ఆశ్చర్యం లేదు! వేదసారస్వత సౌందర్యమనే ఒక స్వకీయ వేదవ్యాఖ్యానం స్వామి రచించా లనుకున్నాడు కాని అంతకంతకు నైష్కర్మ్యమహాకాశంలోకి ఎగిరిన రామపరమహంస ఆ రచనను తన మధుర జీవిత స్వరూపంలో మాత్రమే మనకు చూపించాడు.

బాసిను ప్రాంతీయులైన పల్లెవాసులాయనకు పాలు తెచ్చి యిస్తుండేవారు. స్వామి మహోన్నత వేదాంతాశయాలు ఆ ఆటవికులకు ఏమి తెలియకపోయినా, ఆయన విశ్వమయ ప్రేమను ఎలా పంచుకున్నారో తెలియదు కానీ, "స్వామి సాక్షాత్ దేవుడే" అని చెప్పేవారంట. ఏ పండ్లో పాలో తెచ్చి, స్వామికి సమర్పణం చేసి, ప్రసన్న ముఖాలతో ఆ భిల్లులు పోతుంటారు. తమ మధ్య మిత్రుడుగా వసిస్తున్న ప్రత్యక్ష భగవంతుడు, ఆ ఆటవికులకు రాముడు. ఇంక మనం రామపరమహంస ఎగిరే ఎత్తులను చూడడానికి దృష్టి శక్తి చాలదు. ఆయన జీవితమే ఒక యగాధ సాగరం. దాని లోతులను ఎవరు స్పృశించగలరు!

ఆ యరణ్యంలో స్వామి అంత కంతకు నిర్వికల్పయానం చేస్తున్నాడు. జగదుద్ధరణానికై మహాసముద్ర గర్భంలోకి దిగిన యజ్ఞవరాహమూర్తివలె, స్వామిఒక నిర్వికల్పమహామౌన సము

ద్రాలోకి నిర్గమించాడు. ఆ మహర్షి పుంగవుని స్వాత్మనిష్ఠను, స్వస్వరూపానుసంధాన మధుపానమత్తతను గ్రహించలేక పూర్ణసింగ్ "స్వామీ! ఏమిటి ఇలా మారారేమి?" అని యడిగినప్పుడు స్వామి ఇలా ప్రత్యుత్తరమిచ్చాడు. ఆయన వాక్యాల్లోని ఆయన జీవితచ్ఛాయలను గుర్తిద్దాం.

"పూర్ణజీ! జగత్తుకు నా మూలాల్లోనే పనిఉన్నది. నేను జనులముందర పుష్పరూపంలో కనపడినప్పుడు, నన్ను చాలమంది రుచిచూస్తారు. అయితే భూగర్భంలో గుప్తప్రదేశాల్లో పండ్లకూ ఫలాలకూ ఆహారం సమకూర్చే వేళ్ళవద్ద నేను పడవలసిన శ్రమ వాళ్లకేం తెలుస్తుంది. నేనిప్పుడు నా మూలస్థానంలో ఉన్నాను. ప్రపంచంలో భావాలు ప్రబోధించడం ప్రచారం చెయ్యడం, యిలాంటి బాహ్యరంగ కర్మలకంటె మౌనం శ్రేష్ఠతర కర్మ. మహనీయుల్లైన శంకరాచార్యుల విజయానికి వెనుకవున్న మూలకారణం, గౌడపాద గోవిందాచార్యుల మహామౌనమే."

స్వామి హైందవ వేదాంతాదర్శ శిఖరానికి అధిగమించాడు. దేహభావస్మృతి విహీనుడై స్వామి అలాగే రోజులకు రోజులు ఆ పర్వత సానువులపై సమాధి నిమగ్నుడై యుండేవాడు. నడుస్తున్నా, ఆయనకు ఆత్మ తప్ప వేరొక ప్రపంచం కనపడదు. స్వామి ఆత్మనిష్ఠుడు. జ్ఞానచైతన్యుడు. ఆయన అప్పుడప్పుడు ఇలా అనేవాడు: "ప్రపంచం ఉన్నదనేదెవరు! పూర్వం లేదు ఇప్పుడు లేదు ముందుండబోదు." ఒక్కొక్కప్పుడిలా అనేవాడు స్వామి: "ఓ మానవులారా! మీరు

వచ్చి మీలో నమ్మకం కలిగించి, పరమాత్మను మరిపించదలిచారా ?" ఆత్మ విస్మృతిని ఒక్క చీమంతకూడ భరించలేదు రామపరమహంస. అట్టిది ఆయన ఆత్మ ప్రణాయం !

1906 ఫిబ్రవరి సగం జరిగివుంటుంది. ఎండాకాలపు అడుగుజాడలు కనపడసాగినవి. రాముడక్కడనుంచి నారాయణ స్వామితో దేవప్రయాగకు పయనించాడు.

ఇక్కడ తూర్పునుంచి అలకానంద, ఉత్తరంనుంచి భాగీరథీ నది వచ్చి కలుస్తాయి. స్వామి యీ దివ్యప్రదేశంలో కొన్నాళ్లున్నాడు.

అటనుండి స్వామి అతి ఏకాంత ప్రదేశమైన వాసిష్ఠాశ్రమానికి బయలుదేరాడు. ఈ పుణ్యభూమి టెహ్రీకి 50 మైళ్లుంటుంది. పన్నెండు లేక పదమూడు వేల అడుగుల ఎత్తున ఉంటుంది. మార్గంలో టెహ్రీమహారాజుగారి ప్రార్థనానుసారం భృగు గంగాతీరమందలి సింలాసు వనగృహంలో కొన్నాళ్లున్నారు. మైదానాలనుంచి, స్వామికి అనేకాహ్వానాలు వచ్చాయి. కాని మహాప్రస్థానయాత్రకై నిర్గమిస్తున్న స్వామి, వెనుకకు తిరుగలేదు. సన్న్యాసియానాకాశంలో ఎగిరి పోతున్న ఆ పరమహంస ఇంక క్రింది చూపులేదు. ప్రజల ఆహ్వానాల మీద స్వామి తనకు ప్రతినిధిగా ధర్మప్రచారానికి శిష్యుడైన శ్రీ నారాయణ స్వామిని పంపాడు.

తదుపరి స్వామి ఏకైక బ్రహ్మభావపరవశుడై, 1906 మార్చిలో శ్రీ వాసిష్ఠాశ్రమానికి విజయంచేశాడు. శ్రీ రామచంద్ర భగవానుని ఆచార్యుడు, బ్రహ్మర్షి పుంగవుడు, అఖండ

జ్ఞాననిధి యని పురాచరిత్రలలో విశ్రుతి కెక్కిన శ్రీ వసిష్ఠ భగవంతుని తపఃప్రదేశమది. ఆ వసిష్ఠ గుహలో రామమహర్షి వసింపసాగాడు.

ఈ మహారణ్యం అతి గంభీర సౌందర్యవంతమైంది. దివారాత్రాలు రామునికి కనపడవు. బ్రహ్మ తన్మయుడై, రాముడున్నాడు

ఒకటిరెండు మాసాలలో స్వామి తీవ్ర జ్వరపీడితుడైనాడు. (శ్రీ) నారాయణస్వామి ఈ సంగతి తెలిసి 1906 మేలో, తన పర్యటనాన్ని ఆపి, వసిష్ఠాశ్రమం చేరాడు. కొన్ని వసతులకై ఆగుహను వదలి దానికపైన ఆరుమైళ్ళ దూరంలో ఉన్న ఇంకో ప్రదేశానికి వారిరువురూ వెళ్ళారు. ఆ స్థలం అత్యంత ప్రకృతిరమణీయం. రాముడు ఆ వనానికి గంధర్వ వనమని పేరుపెట్టాడు. ఆ మహావన వర్ణనలు మహాకవి యైన స్వామి రచనల్లో చదివి మనం చూచినట్లు ఆనందించగలం. నారాయణస్వామి తానుండడానికి భృగుగంగా తటంలో ఒక పర్ణశాల వేసుకున్నాడు. రాముడొక గుహలో ఉన్నాడు. రాముడుండే గుహకు ప్రక్కనే ఉంటున్న పొరుగు మిత్రుడెవరో మీకు తెలుసా? ఒక బ్రహ్మాండమైన కొండచిలువ. అది తన సొరలోకి పోవడానికి ఒక అరగంట పట్టేదట. స్వామి ఉండే గుహకు ముందు ఒకచిన్న లోయ ఉన్నది ఆ లోయకు మధ్య, రామునిగుహకు ఎదురుగ్గా ఒక గుహ ఉన్నది. దానిలో ఒక సింహం ఉండేది. ఇవీ రాముని పొరుగు మిత్రులు. అనేక సార్లు ఆ అరణ్యకేసరి, మన వేదాంతకేసరి ఉండే గుహ

ముందుగా పోతుండేది. కానీ అది రాముని గుహలో ప్రవేశిం చేదికాదు. విశ్వప్రేమ స్వరూపుడైన రామ పరమహంసకీ భీకర ప్రకృతి విభిన్నంగా కనపడలేదు. అందుకనే ఆయన పరవశోన్మత్తుడై ఆసనతమస్సులలో ఇలా బ్రహ్మానందాలాపన చేశాడు :

"ఈ యరణ్యంబులు ఈ మహానదులు
ఈ క్రూరమృగములు ఈ విహంగములు
ఈ పర్వతంబులు, ఈ సర్వజగము
నేనే నహా! ఇవి నేనేను నేనె!"

వర్షముల ఆధిక్యత చేత స్వామి నివాసం తరువాత, ఆగుహాకు కొన్ని మైళ్ళ దూరంలో క్రిందనున్న ఒక మనోజ్ఞ ప్రదేశంలో ఒక కుటీరానికి మార్చబడింది. ఆకుటీరంలో రాముడు కొద్దిరోజులు గడిపాడు. ఆ వెలుపల కురిసే వర్షాలలో రాముడేకమై బ్రహ్మానందాశ్రు వర్షములు కురిసేవాడు. పర్వతాలు ఊగిసలాడేలాగు ఫెళఫెళమనే ఉరుములలో, రాముడానందపరవశోన్మత్తుడై ఓంకార గర్జనలు చేసేవాడు. తళతళ మని మెరిసే మెరుపులలో, రాముడు తన మందహాస రోచిస్సులను విరజిమ్మేవాడు. రామ జీవవాహిని యిట్లు ఒకే ఒక బ్రహ్మానంద జలపాతమై నినదించింది.

ఆనందతన్మయుడై నడుస్తూ నడుస్తూనే స్వామి పడిపోయేవాడు. సాయం సంధ్యారుణ కాంతులలో స్వామి, పరవశోన్మత్తుడై తాండవించేవాడు. చప్పట్లు చరుస్తూ, చేతులు పైకెత్తి తాండవించేవాడు. చైతన్యుల హరినృత్యములు జ్ఞప్తికి

వస్తున్నాయి. భక్తి, జ్ఞానం, నిజమైనవై ప్రకాశించినప్పుడు వేరు గావని మనం తెలుసుకోవాలె.

పద్మాసనస్థుడై స్వామి తదేకనిష్ఠలో కూర్చుండేవాడు. రోజులు గడిచిపోయేవి. స్వామిపలుకడు. కదలడు. ఒకే ఒక మహా మౌనసముద్ర గర్భంలో మునిగిపోయేవాడు. ఒక మహాప్రవాహం ఒక్కొక్కచోట ప్రచండంగా త్రుళ్ళింతలతో గర్జిస్తూ, ఒక్కొక్కచోట గంభీర నిశ్శబ్దతలో పారుతూ సాగిన మాదిరి రామతీర్థ భగవానుడున్నాడు.

ఒకసారి, స్వామి బ్రిటిషు గవర్నమెంటుకు వ్యతిరేకియైన గొప్ప జాతీయవాది అనే అనుమానంతో, ఇండియన్ పోలీసు శాఖ ఆయనపైన కాపలా వేస్తున్నారనే ఒక లేఖ వచ్చింది. స్వామి అన్నాడు: "వాండ్లకు చెప్పండి. నన్ను నేను కాపాడ దలచుకోను. నన్ను వాండ్లేవిధంగా ఎంచుకున్నా సరే. నేను నేనుగానే ఉంటాను. నేనొక భారతీయునిగా నా దేశం స్వతంత్రం పొందాలని వాంఛిస్తాను. ఒకనాటికి అది స్వతంత్రత పొంది తీరుతుంది. ఈ రాముడే దానికి స్వాతంత్ర్యం తెస్తాడో, లేక అనేకమంది రాములు తెస్తారో ఎవరికి తెలుసు."

ఆహారవిషయాల మార్పులచేత స్వామి ఆరోగ్యం చెడింది. అందుచేత, కొన్నాళ్ళు, స్థలమును మార్చడానికి స్వామి యనుచరులు ఏర్పాటుచేశారు. టెహ్రీకి పోవడానికి సంకల్పించారు. ముందుగా వెళ్లి ఏర్పాటులు చేయడానికి నారాయణ స్వామి, పురాన్‌సింగ్ టెహ్రీకి పయనించారు. 1906 సెప్టెంబరులో విషయమిది: వెళ్లిపోయే రోజున పురాన్‌సింగు చెబు

తాడు: "స్వామి నన్ను స్నానానికి తీసుకపొమ్మని అడిగాడు. స్వామి కమండలవ్వూ, తుండుగుడ్డా తీసుకొని వారితో నదికి వెళ్లాను. ఆరోజుల్లో స్వామి, ఏదో వివశత్వంలో ఉండేవాడు. ఆయన గుడ్డలన్నీ విప్పి, స్వామిని దిగంబరుని చేశాను. నదిలోకి స్వామి దిగాడు. స్వయంగా నాచేతులతో స్నానంచేయించాను. ఆ ఉదయమంతా ఆకాశంలో మబ్బుపట్టి ఉన్నది. స్వామి కుటీరానికి తిరిగివచ్చారు ఇంక నేను పూరికి వెళ్లే సమయమయింది. "పురాన్ జీ! నీ వెక్కడికి పోయినా స్వర్గంలో, ఆత్మతేజంలో జీవించు. రాముడు ప్రారంభించిన ఉద్యమాన్ని కొనసాగించు. రాముడు మౌనముద్ర వహించనున్నాడు — మౌన్ హోజామ్" అన్నాడు స్వామి. నేనిలా అన్నాను. "స్వామిజీ! నేను వచ్చి మీకు చక్కిలిగింతపెడతాను. మీరు నవ్వి మాట్లాడతారు. మీ మౌనం చెడగొడతాను."

స్వామి నేత్రాలు ఎఱ్ఱబారినవి – మహాతీవ్రుడై యిలా అన్నాడు. "మౌనిని మాట్లాడించడానికి ఎవరిచేతనవుతుంది?"

ఇంక నోరుదెరిచి ఏ మాట మాట్లాడడానికీ నాకు భయం వేసింది."

అందరూ ప్రయాణమైనారు నారాయణ స్వామిని పురాన్ సింగును జగత్ రామ పండితుని పంపడానికై స్వామి వస్తున్నాడు. పైన వేరేగుడ్డలేదు. చినుకులు సాగినవి, రాముడిలా అన్నాడు. పురాణ్ హృదయంలో భయం పుట్టింది. 'పురాన్ జీ నీవు రాముని స్థితి చూచావుకదా త్వరలో అతని లేఖిని ఆగవచ్చు. అతని నాలుక మౌనం వహించవచ్చు. ఎవరికి తెలుసు–

రాముడింక మిమ్ములను కలువక పోవచ్చు. మీరు రామునిగా మారండి. రామైక్యత పొంది మీరు పఠించండి. రచించండి. సేవచేయండి. రామునిమీద ఇంక ఆశలుపెట్టుకోవద్దు."

పురాన్ కండ్లల్లో కన్నీళ్లు సుళ్లు తిరిగినవి. పురాన్ సెలవు తీసుకోడానికి వంగి నమస్కరించేసరికి ఒక్కసారి బాహ్యా బంధాలన్నీ త్రెంపివేసుకున్న మాదిరి, రామపరమహంస రయ్యి మని వెనుకకు తిరిగి చూడకుండా కొండపైకి పరుగెత్తాడు. ఎట్టి నిస్సంగధృతి !

తదుపరి కొన్నాళ్లు స్వామి, నారాయణస్వామి, సింలాసు వనగృహంలో వున్నారు. ఒక మండలం గడించింది. తిరిగి రాముడు ఏకాంతవాసాన్ని అభిలషించాడు. ఏ కాలంలో బట్టినా ఉండదగిన అనుకూల ప్రదేశాన్ని స్వామి అన్వేషించాడు. మాలీ దేవర్ అనే గ్రామందగ్గిర, గంగాకూలంలో ఒక త్రికోణాకృతిగల మనోజ్ఞ ప్రదేశం కనబడింది, ఆదివ్య ప్రదేశానికి మూడువైపులా స్వామి ప్రియగంగి (గంగ) తన తరంగ హస్తాలతో స్పృశిస్తూ వున్నది. ఒక శతాబ్దానికి పైకాల నుంచీ ఆ ప్రదేశం సాధుపురు షులకు ప్రశాంతతపోవనంగావున్నది. కేశవాశ్రమ స్వామి అనే ప్రసిద్ధ మహాత్ముడీస్థానంలో ఏభైసంవత్సరాలు ఏకాంతవాసం చేసి తన పాంచభౌతిక దేహాన్ని ఇక్కడే పరిత్యజించాడు. అనేకులీస్థానంలో తపశ్చర్యచేశారు. అక్కడగంగ ఉత్తరవాహిని. ఈపవిత్ర మనోజ్ఞ సీమను స్వామి తన ఆశ్రమదేశంగా ఎన్ను కున్నాడు. తన వెంబడి వస్తున్న గ్రామీణులను ఒక కుటీరం వేయవలసిందిగా అడిగాడు.

ఈ వార్త టెహ్రీ మహారాజుకు తెలిసి, స్వామి యిష్టానుసారం, ఒక మనోజ్ఞ కుటీరాన్ని తానే నిర్మింపజేశాడు.

రామతీర్థస్వామి ఈ పర్ణశాలలో నివసింపనాగాడు నారాయణస్వామిని, ఈ ఆశ్రమానికి మూడుమైళ్ల దూరంలో ఉన్న బంరాంగీ గుహాలో నివసింప స్వామి నిర్ణయించాడు. ఈ గుహా గంగాతీరారణ్యంలో ఉన్నది. ఆ గుహాలో ఉంటూ, వారానికి ఒకసారి ఆదివారంనాడు తనకడకు వచ్చిపోవలసినదిగా స్వామి నారాయణకు చెప్పాడు. గుర్వాజ్ఞానుసారం నారాయణస్వామి, తన సామానులతో బంరాంగీ గుహాకు బయలు దేరాడు. రాముడు నట్టికాళ్ళతో, పైమీద గుడ్డకూడా లేకుండా నారాయణుని పంపించడానికి బయలుదేరాడు. అది సాయంకాలసమయం. లోకబాధవుడైన సూర్యభగవానుడు తన దినయాత్ర చాలించబోతున్నాడు. ఆ గురుశిష్యు లిరువురూ నిశ్శబ్దంగా దారిన నడుస్తున్నారు. ఆ నిశ్శబ్ద ప్రకృతిలో గంగాతరంగ ధ్వనులు వినపడున్నాయంతే. ప్రేమతో ణికసలాడే నేత్రాలతో చూచి స్వామి, నారాయణునితో యిలా అన్నాడు. "కుమారా! త్వరగా రాముడు మౌనం వహిస్తాడు. అతని లేఖనీ, నాలుకా బహుశా ఆగిపోవచ్చు. నీవు చూస్తున్నావుకదా! రాముని శరీరం - రోజురోజుకు దుర్బలమౌతున్నది. అతని మానసం ప్రాపంచక కర్మలో అలసి పోయింది. రాముడిప్పుడు పూర్ణవిరాగి. ఇంక జనపదాలకు వచ్చే పరిస్థితి కనబడదు. రాముని శరీరం త్వరలో శిథిలం కావచ్చు. రాముడింక ఈ గంగా హృదయమును వదలడు.

రాముని ఎవరైనా సభలకు పిలిస్తే, ఆతని ప్రాతినిధ్యం నీవు వహించాలె. కాబట్టి నీ గుహాకు వెళ్ళు. ఏకాంతాభ్యాసం చెయ్యి. అనుక్షణం రామునిలో నిమగ్నుడవుగా. వేదాంత స్వరూపంలో వెలికిరా. విచారం పెట్టుకోవాకు. భయదుఃఖాలు పడనవసరం లేదు. నీలో, నీ వెలుపల, సర్వాంతర్యామియై రాముడున్నాడని అనుభవానికి తెచ్చుకో. రాముడు నీశరీరం. రాముడే నీ మనస్సు, నీసర్వస్వం రాముడే. అతడు నీపరమాత్మ. ఈ విధంగా రాముడవుగా!"

నారాయణుని గుండె నీరయింది. నిర్విణ్ణుడై రాముని పాదాలమీద వ్రాలాడు. అశ్రుధారలతో గురుపాదపద్మాలు తడుపుతున్నాడు. రాముడు పరమప్రేమతో నారాయణుని లేవదీసి కౌగలించుకున్నాడు. దయాసముద్రుడైన రాముని నేత్రాంచలాలలో కూడ రెండు మూడు అశ్రుబిందువులు ఉబికాయి. పరస్పరం చూచుకుంటూ ఇరువురూ ఒకక్షణకాలం మౌనంగా నిల్చున్నారు. రాముడు, నారాయణుని గుహాకు వెళ్లడానికి సెలవిచ్చి మరల యిలా అన్నాడు. "కుమారా! దుఃఖపడకు, ఏకాంతంలో చదువు. సాధనచెయ్యి. ధ్యాననిమగ్నుడవుగా. ఆత్మైక్యచిత్తుడవుగా. "ఆత్మతన్మయత – అభ్యుదయబంధం" అనే వ్యాసం చిత్తువ్రాసిన తరువాత దాన్ని సాఫువ్రాయడానికి నిన్ను పిలువనంపిస్తాను.

రాముడు మాలీదేవల్ పర్ణశాలలో ఉంటాడు. ఆదివారం నాడు నీవు రావచ్చు. ఈమధ్యకాలంలో నీవు రాముని భౌతికవియోగవిషయం చింతించవాకు. రాముని భౌతిక శరీరం

త్వరలో చైతన్యమును కోలుపోగలదు. దానిసేవా విషయం నీవు విచారపడకు. నీ స్వాభ్యుదయం మీద ఒకదృష్టి ఉంచు. దేని మీద ఆధారపడవద్దు. నీ పాదాలమీదనే నీవు నిలుచో. వేదాన్తస్వరూపుడవుగా! నీ ఆత్మనిష్ఠుడవై, ప్రపంచం మీదికి వెళ్ళు." ఇవే స్వామి శిష్యునకు చెప్పిన చరమవాక్యాలు.

కుశి నగరంలోని ఆ ఆ రామంలో, ఆనందుని చేరబిలచి, అంత్య ధర్మాలాపాలుచేస్తున్న ఆ నిర్వాణప్రసన్న మూర్తి బుద్ధ భగవానుని రూపం మనకిప్పుడు గుర్తురావడంలేదా? ధర్మ వీరుల అంత్య ప్రసంగాలివి!

నారాయణస్వామి గుర్వాజ్ఞానుసారం ఏదో విషణ్ణ భారంతో, తన గుహకు వెళ్ళాడు. అయిదురోజులు గడిచాయి.

ఆనాడు దీపావళి. కృష్ణ దీపావళికాదు. జగజ్జీవిత తమ స్సును, పటాపంచలుచేయడానికై, రామతీర్థస్వామి, తన శరీ రాన్ని ఒక హారతిగా వెలిగించిన దీపావళి!

స్వామి పర్ణశాలలో వున్నాడు. ఏదో వ్రాసుకుంటు న్నాడు. ఉదయం పది పదకొండుగంటలు దాటింది. వంట మనిషి భోలాదత్ వచ్చి, "స్వామీ చాలాసేపయింది. ఎండ బడింది భోజనానికి లేవండ"ని పిలిచాడు కానీ స్వామికి ఆ మాటలు వినబడలేదు. ఆయన లోకంలో ఆయన వున్నాడు. వ్రాస్తున్న కాగితమూ, కలమూ క్రింద జారిపడ్డాయి. స్వామి నేత్రాంచలాలగుండా ఆనందపరవశాశ్రుధారలు జలజల రాలు తున్నాయి. ఏదో భావసమాధి నిమగ్నుడై యున్నాడు స్వామి.

రెండుమూడు పిలుపులకు, స్వామి బాహ్యస్మృతివచ్చి "నాయనా ఏమి"టన్నాడు. భోలా దత్తు, "స్వామీ భోజనానికి లేవండి. ఇప్పుడు పదకొండు దాటింది. మీరు స్నానం చేయ డానికి నీరు ఇక్కడికి తెమ్మంటారా? లేక నదికివస్తారా!" అని అడిగాడు (దీపావళికి ముందు కొన్ని దినాలనుంచి స్వామి నదికి స్నానానికి వెళ్ళడం లేదు. వ్యాయామంలో కాలికి దెబ్బ తగి లింది.) స్వామి నవ్వి "నీవు అన్నం తిన్నావా లేదా" అని అడి గారు. "మహారాజ! ఇవ్వాళ స్నానంచేసిగాని నేను అన్నం తినను మీ పని అయిన తర్వాత నేను స్నానం చేద్దామను కొన్నాను. అందుచేత నేనేమీ తినలేదు" అని భోలాదత్తు అన్నాడు. స్వామి పకపకానవ్వి ఆనాడు అతని స్నానకారణం అడిగాడు. (భోలాదత్తు ఇతర పర్వత వాసులలాగా కొన్ని వారాల పర్యంతం స్నానం చెయ్యడు). భోలాదత్తన్నాడు. "మహారాజా! ఇవాళ దీపావళి. సంక్రాంతి, అమావాస్య, ఇలాంటి పర్వడిదినాన ఒక్కసారి గంగలో మునక వేయంది అన్నం తినను." స్వామి అన్నాడు. "ఓహో! ఇవ్వాళ అలాంటి పుణ్య దినమా? రాముడుకూడా గంగలో స్నానం చేస్తాడు. మనం ఇద్దరం కలసి పోదాము."

అని స్వామీ, వంట బ్రాహ్మణుడూ కలసి గంగానదికి స్నానానికి వెళ్ళారు.

కార్తీక వర్ష ధారలతో సుళ్ళుతిరుగుతూ పొంగి పారు తున్న మహాగంగలో శ్రీరామతీర్థస్వామివారు స్నానంచేయను కంఠంవరకు దిగారు. స్వామి శరీరస్మృతిలో లేని పారవశ్య

స్థితిలోఉన్న విషయం మనకు తెలుసు. అర్థదేహస్మృతిలో కాలుజారి గంగలోపడిపోయారు. "ఓ దేహమా! నీకీ విధంగా ఉన్నట్లైతే, వెళ్లిపో, అమ్మను (గంగను) స్మరిస్తూ వెళ్ళిపో" అని స్వామి ఓంకారసంస్మరణ చేస్తూ గంగలో మునిగి పోయారు. గంగాగర్భం ఓంకారనాదంతో నినదించింది. ఆ పరమహంస అనంతతన్మయ గమనానికి, అలసి శరీరమనే ఒక ఈకె రాలిపోయింది. అమరమూర్తి ఎప్పుడో, శరీరమును పరిత్యజించారు! శరీరమున్నదనే భావనలేని ఆ పరమఋషి, తన శరీరమును ఒక చినిగిన వస్త్రంవలె విసరిపారవేశాడు. రామ పరమహంస, "ఏకమేవాద్వితీయంబ్రహ్మ, అహం బ్రహ్మాస్మి" అనే రెండు రెక్కలతో ఎగిరిఎగిరి నిత్యనీలా కాశంలో కలిసిపోయింది. ఆ అమరమూర్తి విశ్వవ్యాప్త మూర్తియై, బ్రహ్మగీతాలాపన చేస్తున్నాడు. ఆయన ఆ మహా నిర్వాణగీతిక విన్నారా!

"ఓ మృత్యుదేవతా! కావలెనేని
తీసుకపొమ్ము యీ దేహంబునీవు
ఎన్నియో దేహముల్ కలవునేదాల్ప,
చంద్రుడునేసిన వెన్నెలవలువ
లానందముగదాల్చి విహరింతునేను,
సూర్యుడొసంగు కాషాయవస్త్రముల
కట్టి మహాహ్లాద నియతితోనుందు
జలజలబారెడి సెలయేటిరొదల
నేగాన మొనరింతు గళముపైకెత్తి

వీచికాహస్తముల్ పైకెత్తి ఆడు
వనధిలో నే నహో తాండవించెదను
స్వేచ్ఛాగామారుతంబుల విహరింతు
ఇవియెల్ల నేను ధరించురూపములె
ఉన్నత శిఖరాగ్రభాగాలనుంచి
క్రిందికి ప్రేమంతో దిగివచ్చినాడ
మీ కవాటద్వారముల దట్టినాడ
గాఢసుషుప్తిలోనుంచి మిమ్ములను
మేలుకొల్పితి నిద్రకంపించిపోవ
ఒకరినోదార్చితి, నొకరికన్నీళ్ళు
చల్లని చేతులతో నొత్తినాడ
చలిలోన గడగడలాడువారలకు
హాయిగా ధరియింప వస్త్రంబులిత్తు,
కొందరిముసుగుల తీసివేసెదను
సర్వంబుధరియింతు, భరియింతు నేను
సెలవిదే సెలవిదే నాకేమివలదు
నే నేది దాచుకో నిసుమంతయైన
నే నెవ్వరికి గోచరింప, నన్నెవరు
తెలుసుకోలే రిదే సెలవింక సెలవు

ఓం!



